ఓం

నమఋషిభ్యః

మతప్రభాకర గ్రంథమాల | "యోగక్షేమం వహామ్యహం" (భగవద్గీత) | పంచదశ మరీచి

# మతప్రభువు

(ప్రథమభాగము)

బ్రహ్మశ్రీ ప్రభాకర ఉమామహేశ్వర పండితులవారి యుపన్యాస సారం.

చిత్తూరు జిల్లా, అత్తిమాంజేరిపేట గ్రామ సంఘమువారి ద్రవ్యసహాయముచే ప్రచురింపబడియె.

హిందూమత సం॥ ౧౯౫,౫౮,౮౫౦౨౨

195,58,85022. సం॥

మొదటి కూర్పు.

ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల, బెజవాడ.

 1921. [వెల 0-5-0.



# మతప్రభువు

ప్ర. ప్రభువన నెవడు. అతనిధర్మమేమి ?

ఆ. జీవరాశికధిపతి ప్రభువనబడు. అధిపతియన రక్షించువాడు. జీవుడెద్దాని గోరిన దానినెల్ల నొసంగుట ప్రభుధర్మమగును. ఇహలోక ప్రభువునకును, పరలోకప్రభువునకును ధర్మము సమానముగ నుండు. ప్రత్యక్షములేని పరలోకప్రభువును తెలియదలచినవాడు ఇహలోక ప్రభుధర్మముల ననుభవమున నెఱుంగవలెను.

ప్ర. జీవుని రక్షించుటయన నేమి?

ఆ. (1) బంధములనుండి విడిపించుట (2) బాధలనుండితప్పించుట (3) బాంధవ్యముల నేర్పఱచుట (4) ఆనందమొదవజేయుట రక్షణమనబడు. ఇహలోక ప్రభువును ఈ ప్రభువనియు పరలోక ప్రభువును ఆప్రభువనియు గుర్తునందుంచుకొనుము.

ప్ర. ఈ ప్రభు ధర్మమునుబట్టి ఆ ప్రభుధర్మమును సరిపోల్చునట్టి యుదాహరణముచూపెదరా?

ఆ. పరదేశజనులు సంఘములుగ జేరి సైన్యరూపములధరించి మనదేశమాక్రమించి మనధనమెల్ల గొల్లబెట్టి మనభూముల నాక్రమించి మనవృత్తుల నశింపజేసి మనల నడవుల పాలొనర్చి మలమలమాడ్చుకుండునటుల మనప్రభువు బంధములనుండి విడిపించును. మఱియు మనలోమనము అహంకార మమకారములచే తిట్టుకొనినను కొట్టుకొనినను పరస్పరధనములపహరించినను అట్టిబాధలనుండి తప్పించును. మనము సౌఖ్యముగ జీవించు నిమిత్తము విద్యాశాఖను వైద్యశాఖను ఉద్యోగశాఖను వ్యవసాయశాఖను ఇటులముఖ్యశాఖలనెన్నిటినొకల్పించి కల్పవృక్షమా యనునట్లు ఈప్రభువు బాంధవ్యములనేర్పఱచును. అట్టిశాఖలందు ప్రవేశించి పనిజేయుచున్న మనలగనికరించి తనివినొంది తత్కార్యోచితఫలంబులొసంగి యానందమొదవజేయును. ఈ ప్రభువు పైనాల్గు పనులందెటుల చూఱుకుతనముగ బుద్ధివైశద్యమున కర్మిష్ఠియైయుండునో అటులపరలోక ప్రభువునయితేను పైధర్మముల బాటించుచుండును. ఎట్లనభూమిఎల్లపుడు కంపించకుండను సముద్రముప్పొంగి భూమిపైజొచ్చకుండను గాలిబాహుళ్యముగవీచుచు కన్నులలోదుమ్ము పో

కుండగను సూర్యచంద్రులు తీక్ష్ణము పొందియుండకను నసోయ్యకరోగములు వర్ణాశ్రమధర్మములు దప్పివర్తించకుండగను ఈ మొదలగు బంధములనుండి యాప్రభువు కాపాడును. దుష్టప్రభువులు ప్రజలపీడించుచున్నను దుష్టులు శిష్టుల బాధించుచున్నను కలరా మొదలగు జనపదవిధ్వంసములగు రోగములు జనులనశింపజేయుచున్నను ఆప్రభువు అవతారములచేతను వంశనాశనము చేయుటచేతను మ్రొక్కుబడులిడినపుడు శాంతింపజేయుటచేతను మనబాధలను పోగొట్టుచుండును. మఱియు నానాదేశ భేదములనుబట్టి జాతిభేదములనుబట్టి బుద్ధిభేదములనుబట్టి తగినవేదములను ధర్మశాస్త్రములను పురాణములను అవతారపురుషులను మతకర్తలను ఉపదేశకులను పంపుచు నీమొదలగుబాంధవ్యములను గల్పించుచుండు. ఆయా వేదములపఠించి ధర్మములననుష్ఠించి అవతారపురుషుల విశ్వసించి మతబోధకులను గురువులుగజేసికొనెడివానకు కర్మబలము ననుసరించి సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యముల నొసంగుచుండును.

ఇచట గమనించ దగిన విషయమొకటి గలదు.

(1) ఈలోకమున ప్రత్యక్ష ప్రభువొకడు కలడనియు, అతడు మన యందఱి నడుమనే యుండెననియు, ఉండినను అతని నందఱు జూడజాలరనియు నతనిచూడకున్నను లోకానుభవముచేతను ఆప్తవాక్యములచేతను పుస్తకములచేతను అనగా శబ్ద ప్రమాణములచేతను నిశ్చయింపబడుననియు దెలసి విశ్వసించి అట్టిప్రభువుయొక్క భయముచే నతనికి శిస్తు (పన్ను) మొదలగుదాని నొసంగినపుడు పైనాలుగు లాభములబొంది సుఖించగలము.

(2) (పరమున) ఆలోకమున (దేవుడు) ప్రభు వొకడు కలడనియు మనయందే నిండియుండెననియు నీకన్నుల కగోచరుడనియు ఐనను మనయనుభవమునకు వచ్చుచుండుననియు శబ్ద (వేద) ప్రమాణముచే దెలియబడుననియు నిశ్చయించి భక్తిచే సర్వస్వము నర్పించినపుడు పైలాభముల బొంది యానందించగలము.

ఆ. ఏయానందమును మనము పొందనెంచుచుంటిమో అద్దానిబొందియుండిన మానవుడెవడైనకలడా?

ఆ. సంపూర్ణానందమును పొందియున్నవాడు దేవుడొక్కడే కలడు. దేవుని యొక్క సంపూర్ణానందాబ్ధిలో మనమొక బిందువుగానుంటిమి. ప్రతిజీవునియొక్క ఆనందబిందువులన్నియు కలసి దేవునియొక్క సంపూర్ణానందాబ్ధియనబడు. సముద్రమునందొక వస్త్రముపడవైచినపు డావస్త్రమునందు సముద్రోదకము వ్యాపించునుకదా? అవస్త్రము కొంతనీరును గ్రహించినపుడు సముద్రజలముయొక్క సంపూర్ణత్వమునకులోపమురాజాలదు.

సముద్రమునుండి వస్త్రమువిడఁబడినపుడు వస్త్రముచే పీల్చబడిన నీరు సముద్రమునుండి వేరుబడి యాసముద్రజలమును కొంత తగ్గింపవచ్చును. దేవునియందు జీవుడనెడి వస్త్రము వేయబడి యుండెనే కాని దేవునియొక్క స్థలమువిడిచి జీవుడు అన్యదేశమున నివసించలేడు. గాన దేవునిసంపూర్ణత్వమునకెపుడును భంగమురాఁజాలదు. ఒకతటాకమున నొక వస్త్రము నైచితిమనుకొనుము. ఆమంచినీరు వస్త్రమునందు చేరుటసహజమేయగును. ఆ వస్త్రమందు చేరినజలము సహజముగ శుద్ధమైనదైనను వస్త్రసంబంధముచే దానిని మలినము పొందినదానినిగ దలచుచుందుము. ఆమలినవస్త్రమును ఆమలినజలమును ఆతటాకమందొక ప్రక్కనుంచుకొనియే యందపరిశుద్ధము కలదని యెఱింగియు తటాకజలము శుద్ధమైనదని చెప్పుచు దానిని త్రాగుచుందుము. ఆ శుద్ధజలము అపరిశుద్ధముతో కూడియున్నను దోషము కాదనియే మనతలంపు. ఇదికడుచిత్రముగను సమాధానమొసంగజాలనిదిగను యుక్తిరహితమైనదిగను మనస్సున కందరానిదిగను తోచుచున్నది. అయినను చేయునదేమి? ఆస్థితియటులున్నది. సహజముగనటులున్న దానిని అటులేకుండెనని యడుగుట యవివేకమగును. శుద్ధమైనతటాకజలము వస్త్రమునచేరి యపరిశుద్ధస్థితి వహించినపిమ్మట తిరిగి దానికి పరిశుద్ధతకలుగుటెట్లో యోచింతము. ఆవస్త్రమునకు నీటిని పీల్చుస్వభావము నశించెనేని అపరిశుద్ధము జేయబడినజలము శుద్ధమగునని సిద్ధాంతము చేయవచ్చును. ఇందుకుపాయమేమి? వస్త్రముకాల్చబడవలెను. అంతవస్త్రమున జేరియున్న జలబిందువులు తటాకజలమున కలియఁగలవు. వస్త్రమందలిజలమున్ను వస్త్రమున్ను కూడియుండిన స్థితి వంటిది జీవుడని చెప్పబడును. వస్త్రము దహింపబడవలసినటుల జీవునియందున్న మాయ యనెడి వస్త్రము కాల్చబడవలెను. అంతజీవునియందున్న జలబిందువు బ్రహ్మమందైక్యమగును. ఇదియేజీవునకు బ్రహ్మానందముప్రాప్తించుట యని పెద్దలు పల్కుదురు.

అ. ఇపుడు జీవునకు బ్రహ్మము (ప్రభువు) తో కలిగినపని యెట్టిదని తెల్పితిరి?

అ. జీవేశ్వరైక్యమేపనియని యెఱుంగుము. అనగాజీవుడు దేవునితో కలియుటయే యిచ్చటితాత్పర్యము.

అ. జీవునకును దేవునకును గలిగెడి యైక్యసంబంధముచే నీయుభయులకు బాంధవ్యమెట్టిదైయుండవలెను? అనగాజీవునకు దేవుడేమగును? దేవునకు జీవుడేమగును?

అ. లోకానుభవమున నేయేబంధువులకు నైక్యముపొసగుచున్నదో, ఆయుభయులకుగలబాంధవ్యమే యీజీవేశ్వరులకును నిశ్చయింపబడునని యెఱుగుము. ఆబాంధవ్యమిపుడు విమర్శించెదవినుము. సృష్టియందు సహజముగనుండునట్టి బాంధవ్యము భార్యాభర్తయులగును. ఏమన నీదంపతులులేనిది, మానవసంఘముండుటయే యసంభవము. సర్వ

మానవాభివృద్ధికి నీదాంపత్యధర్మమే ప్రథమసోపానము. వీరినాధారము చేసుకొని తదితర బాంధవ్య మేర్పడుచున్నది. భార్యయు భర్తయు నేర్పడినపిమ్మట వారినుండి యొక మానవుడు పుట్టుచున్నాడు. ఇతడు పుత్రుడనెడి బంధువగుచున్నాడు. అపుడా దంపతు లితనికి తల్లిదండ్రులనెడి బంధువులగుదురు. ఆతలిదండ్రులకు మఱియొకడు జనింప నతడు మొదటివానికి సోదరుడగుచున్నాడు. ఆడబిడ్డపుట్టినపుడు సోదరియగుచున్నది. వీరిబిడ్డలు ఆ మొదటితలిదండ్రులకు మనుమలగుచుందురు. ఇటుల బంధునామములు క్రమముగ పెరుగుచున్నవి. ఈ బంధువులందరు పరస్పరము కొన్ని విషయముల లోనే బంధింపబడుచుండిరే కాని సర్వవిధములబంధింపబడి యుండలేదు. ఏమన తల్లికిని పుత్రునకును కొన్ని సందర్భములందు బంధుత్వమే లేదు. బంధుత్వమనబంధము. బంధమనననంటుకొనుట. దేహదేహాంగములుగాని పరస్పర మనోభావములుగాని తల్లులకు పిల్లలకు నంటుకొనియుండవు. పరస్పరముకొన్ని మర్మములుండియేతీరును. తల్లి దండ్రులు తమమర్మములన్నియు పిల్లలకును ఇటులనే పిల్లలు తమమర్మములను తండ్రుల కును దెల్పజాలరు. సోదరులున్ను సోదరసోదరీలున్ను తాతమనుమలున్ను తదితరబంధువు లును సర్వవిధముల మర్మరహితులై నిర్మలహృదయులై యుండుట లోకానుభవవిరుద్ధము. ఎచ్చట నుభయులకు నడుమ మర్మ (అభ్యంతర) ముండునో అచ్చటమనస్సునకు సంపూ ర్ణతుష్టియుండదు. సంపూర్ణానందసంపాదనార్థము మనుజుడు సంకల్పించుగాని తనకు తెలియ నట్టికొంతమర్మముండెనని గ్రహించినపుడా యసంపూర్ణమునకై యాశించడు. దేహాదేహ ములకుచాటులేనట్టియు మనోభావములకు భేదములేనట్టియు మర్మరహితమైనట్టియు, బంధుత్వమొక్క దాంపత్యమందేమనము కనుగొనవచ్చును. ఎవ్వనిప్రశ్నించినను తండ్రిగా పుత్రుడుగా, సోదరుడుగానుండుట కిష్టపడక యేసతిగానో యేపతిగానోయుండుట యుత్కృష్టమని వచించును. దేవుడు తండ్రియగుపక్షమున మనముపుత్రులమైతిమేని పర స్పరము కొంచెము మర్మముండుట వాస్తవమగును. సంపూర్ణబంధుత్వము శూన్యమగును. మనోభావముల కైక్యముపొసగదు. తండ్రి తనతల్లికి కలుగజేసెడి బ్రహ్మానందము తనకు కలిగింపజాలడని తెలసినపుడు సంపూర్ణానందమును పొందదలచినతాను దేవుడు తనకు తండ్రియని నిశ్చయించి సేవింపజాలడు. ప్రతిజీవుని ముఖ్యోద్దేశము పతిగానుండుటయో సతిగానుండుటయో బ్రహ్మానంద జనకమైనదని సిద్ధాంతమైనపుడు ఆజీవుడు దేవునకు సతిగానుండుటకైనను, దేవునకు తాను భర్తగానుండుటకైనను, నిర్ణయించుకొనును. ప్రతిజీవుడు సంపూర్ణానందము లేనివాడై యుండెగాన, పతిత్వపదవినధిష్ఠింపజాలక ఆ యాధిపత్యమును దేవుని యందుంచి, అనగా దేవుని భర్తగావరించి, తాను భార్యారూప మున, వర్తింపనెంచును. నిష్కల్మషముగ మాట్లాడదలచి దేవునకు సర్వలోకాధిపత్య

మొసంగినపుడు, అనగా జగత్పతియనెడి నామము ప్రశంసించినపుడు ఆ దేవుడు సర్వ జీవులకు పతియగుట తథ్యమై జీవులందఱు సతులగుట సత్యము కాకమానదు. జీవేశ్వరులకు సతీపతి ధర్మమే బాంధవ్యమని నిశ్చయింపబడెను.

ప్ర—జీవుడు దేవునిగూడి యానంద మనుభవించుటకు నేయే మార్గముల నవలంబించవలెను ?

ఉ—లోకమునలేని, యభూతమును కల్పించి పలికినపుడది, చిత్తవిభ్రాంతి నొసంగజాలదు గాన, సతీపతి ధర్మముల విమర్శించిచూతము. ఒక స్త్రీ తన పురుషునిచేరి, యానంద మొందుటకై చేయుపనులెన్ని విధములో గమనించినపుడాయామార్గము లన్నియు జగత్పతిని పొందుటకు వీలగును. (1) స్త్రీ పతియందు భక్తికలిగియుండు (2) పతిని ప్రేమించుచుండు (3) ఒకపుడు మిత్రునివలెనుండు (4) ఒకపుడు తండ్రివలెను, తల్లివలెను తదితర బంధువులవలెనుండు (5) స్త్రీ యెల్లపుడు పతియందు భయముగలదైయుండు (6) నీచాధికములనక, యెట్టి పనియైనను వెట్టి (నౌకరి) వానివలె జేయుచు దాసియైయుండు (7) సరసపల్లా పోక్తులచే, హేళనముగ, నిరసనముగ, కోపముగ, కఠినముగ, నతని లోపములనెంచుచు వైరము వహించినటుల వర్తించుచుండు (8) ఒకపుడు అంగాంగ సంబంధరూపమున క్రీడించి, యానందించు (9) గాఢసుషుప్తి యుందేమో చెప్పజాలముగాని జాగ్రత్స్వప్నావస్థలలో నేయేకార్య మొనర్చుచుండినను ఆ ప్రతికార్యము పతినిమిత్తముగా జేయుచు తత్ఫలమంతయు పతికి నర్పించుచుపతియే తాను- తానే పతియనెడి యభిన్నత్వమునకు వచ్చి పురుషార్థభాగమును వీడి పురుష రూపమున నైక్యమై అనగా సతీపతి యనెడి శబ్దద్వయ వినాశన మొనర్చి ; ఏకశబ్ద స్వరూపమై తుదకు శబ్దరహితమై నిశ్చలమైయుండు. ఏ మతము జీవునకు దేవునితో సంబంధము కలుగజేయనెంచెనో — ముక్తినొసంగ దలచెనో ఆ మతము పై మార్గముల బోధించగలిగినపుడే భిన్నరుచులుగల మనుజులు తమకు తగిన మార్గములగైకొని క్రమక్రమముగ స్వారాజ్య మాక్రమించగలరు. ఒకమతము ఏ యొకటి రెండు మార్గములనో బోధించిన యెడల ఆ మార్గములను స్వాధీనమొనర్చుకొనగలిగిన, మనుజుల కేదైన ననుకూలము ఘటించగలదు. అట్టి మతము సర్వజనసమ్మతమైనదని లోకులంగీకరింపజాలరు. ఇటులగాక సంపూర్ణమైన మతముచే ననేకవిధముల వర్ణింపబడిన దేవుడు ప్రభువనబడు. అట్టి సర్వశక్తిగల దైవము పలికిన చదువులు వేదములనబడు. అతని యవతారము సంపూర్ణావతారమనబడు. ఆ సంపూర్ణావతారము పై నుదహరింపబడిన మార్గములనుండి వర్తించెడి జనులకు మోక్ష మొసంగగలుగు, అతని యుపదేశ

ప్రస్తుతము పై నవవిధమార్గముల విశదీకరించి జీవులకు మహోదశ నొందించగలదు.

ఆ—సహజముగ భక్తి కలిగి భగవంతుని భజించుటచే సంపూర్ణానంద మనుభవింపవచ్చునని, లోకమర్యాదయైయుండ భయముచేతను కామముచేతను వైరము చేతను భగవత్సాన్నిధ్యము చేకూరునని పిలపిచ్చుట నూతనముగ దోచుచున్నది. మీరు పరిపోల్చిమాపిన యుదాహరణము యుక్తియుక్తముగ నున్నది. కాని యీ విధముగ పై మార్గము లన్నిటిని బోధించునట్టి మత మెచ్చటనైన గలదా ?

ఆ— విమర్శనముచే నెయ్యది యుక్తియుక్తముగనుండునో, మనోవికాసాస్పద మగునో, అనుభవపూరితమై యుండునో, ఆ సిద్ధాంతము ఋషిమతమున జెప్పబడి యున్నది. ఋషిమతమగు హిందూమతమును సంపూర్ణముగ దిలకించినపుడు పై మార్గము లన్నియు గోచరించును.

అ—ఒకవేళ మతమున నట్టి సిద్ధాంతముండవచ్చుగాని, ఆలోకైక ప్రభువు లోకమం దవతరించి పై సిద్ధాంతముల నాచరణలో బెట్టినటుల చరిత్రాంశము కలదా ?

ఆ—కలదు వినుము. ఋషిమతమున సంపూర్ణావతార మొకటి చెప్పబడెను. అతడే లోకైకప్రభువగు శ్రీ కృష్ణుడు. పరిపూర్ణుడు.

అ. ఋషి మతమున నిదియొకటే యవతారమా ?

ఆ. పెక్కులు కలవుకాని సంపూర్ణావతార మిది యొక్కటే.

ప్రమాణము......గార్గ్య భాగవతము.

(1) అంశాంశమనియు, (2) అంశమనియు (3) ఆవేశమనియు (4) కళయని యు (5) పూర్ణమనియు (6) పరిపూర్ణమనియు అవతారములు ఆరు విధములు.

అంశాంశము = మరీచి మొదలగు వారు.

అంశావతారములు = బ్రహ్మ మొదలగువారు.

ఆవేశావతారములు = పరశురామాదులు.

కళావతారములు = కపిలుడు, మొదలగువారు.

పూర్ణావతారములు = నృసింహ - శ్రీరామాదులు.

పరిపూర్ణావతారము = శ్రీకృష్ణుడు*

---

*పరిపూర్ణతమస్సాక్షాత్ శ్రీకృష్ణోభగవాన్ స్వయం। పరిపూర్ణతమస్సాక్షాత్ శ్రీకృష్ణోనాన్యఏవహి॥

ఆ. అయితే శ్రీకృష్ణునిచారిత్ర మెట్టిది?

ఆ. దుష్టప్రభువుల సంహరించి శిష్టజనుల కభయమొసంగి పూర్వోక్తాహ్వాతన వివిధమార్గములచే, దనను గొల్చినవారికి స్వారాజ్యమొసంగుటయే యాతనిచరిత్రాంశము.

ఆ. విష్ణుమూర్తి యొకప్పుడొక మహాఋషిచే భూలోకమున మనుజుడై పుట్టునటుల శపింపబడి శ్రీకృష్ణుడై పుట్టెనని పురాణము పలుకుచున్నదికదా? తనను పొందిన పాపమనుభవించుటకు జనించిన మనుజుడెటుల పరిపూర్ణతమావతారమనబడు. స్వయముగ పాపియగువాడు ఒరుల పాపముల విముక్తిచేయు టెట్లు?

ఆ. ఆఋషి వైకుంఠవాసియగు విష్ణునిశపించెనేకాని, గోలోకవాసియగు కృష్ణుని శపించలేదు. దుష్టప్రభువులచే పీడింపబడినలోకము గోలోకమునకేగి కృష్ణుని ప్రార్థింప దుష్టశిక్షణార్థ మవతరించెను. అతడొక కర్మముచేగాని, కామముచేగాని జనింపడయ్యె.

భాగవతం. తృతీయస్కంధం.

మ॥ జననంబెందునులేని యీశ్వరుడుదా జన్మించుటెల్లన్ విరో
ధినిరాసార్థము వీతకర్ముడగు నద్దేవుండు గర్మప్రవ
ర్తనుడౌటెల్ల జరాచరప్రకటభూతశ్రేణులం గర్మవ
ర్తనులంజేయదలంచికాక కలవే దైత్యారికిం గర్మముల్॥ 72

క॥ హరినరులకెల్ల పూజ్యుడు। హరిలీలామనుజుడును గుణాతీతుడునై
పరగిన భవకర్మంబుల। బొరయండట హరికి గర్మములు లీలలగున్॥ 73

చ॥ జననములేక కర్మముల జాడలబోక సమస్తచిత్తప
ర్తనుడగు చక్రికిం గవు లుదారపదంబుల జన్మకర్మముల్
వినుతులు సేయుచుండుదురు వేదరహస్యములందు నెందుజూ
చిన మఱిలేవు జీవునికి జెప్పినకైవడి జన్మకర్మముల్॥ ప్రథమస్కంధం 68

ఈ కృష్ణు డవతరింపదలచినపుడు శాపానుభవముకై జనింపవలసిన విష్ణువు తన స్వరూపమును శ్రీకృష్ణునందు లీనమొనర్చెను. శ్రీకృష్ణుడు చేయునట్టి పనులంగొన్ని కర్మబద్ధుడైనట్టి విష్ణుమూర్తివి యని యెఱుంగవలెను.

## విష్ణువు కృష్ణునందు లీనమగుట.

బ్రహ్మవైవర్తం, కృష్ణజన్మఖండము, ప్రథమాశ్వాసము.

సీ॥ సకలలోకైకరక్షకుడు చతుర్భుజుం డతులితపీతవస్త్రాన్వితుండు
మహనీయతర వనమాలికాలంకృతుం డాదిత్యకోటి తుల్యప్రభుండు

దరహాసయుతుడు సౌందర్యమనోజ్ఞుండు సురుచిరాలంకార శోభితుండు
కరుణారసపూర్ణుడు శ్వేతద్వీపవాసియునైన శ్రీవిష్ణుదత్యద్భుతముగ

తే॥ గీ॥ గాంచనరథంబుదిగివచ్చి కాంత్రపద్మ । జూదులీక్షించి యచ్చెరువందుచుండ
రాధికాసాధు దివ్యవిగ్రహమునందు । లీలదీపింపనప్పుడు విలీనుడయ్యె॥

ప్ర. లోకమునకు మేలొనరింపదలచి దేవుడు తనపుత్రుడగు క్రీస్తును పంపియుండియు తిరిగి తానేల కృష్ణుడై యవతరింపవలసివచ్చె?

ఉ. అజ్ఞానశూన్యముగానిది విజ్ఞానోదయ మస్వాభావికము. అపరిశుద్ధముడుగం దినప్పుడు, పారిశుద్ధ్యము ప్రభవించుట లోకానుభవము. దుష్టశిక్షణములేనిది శిష్టరక్షణము అసంభవము. దేవునిపుత్రుడగు క్రీస్తు దుష్టులశిక్షించుటకు బదులు దుష్టులచే శిక్షింపబడిరి. లోకులపాపముల బారదోల వచ్చేసిన క్రీస్తువు పురాణమతమును (పాతనిబంధనము = Old Testment = దేవునివాక్యములను) మారణమొనర్చి తత్పాపఫలముచే తానే మారణమొందె. దేవునివాక్యములగు వేదములననుసరించి శ్రీకృష్ణుడు బోధించె. అట్టిక్రీస్తువు పుట్టుటకంటె నీకృష్ణుడుదయించుటయే యుక్తము. ఏ దేవుడు క్రీస్తువును, పంపెనో ఆదేవునిలక్షణము లీతనియందు స్వల్పాంశములుగనైన నుండ వలసియున్నవి.

క్రీస్తువును బంపినదేవుడు యెహోవాయనెడి నామమున నుండెనని బైబిలునందు కలదు. ఆ యెహోవా, దుష్టులశిక్షించెడి స్వభావముగలవాడో, అనగా, నరహత్య జేసెడివాడో, కాడో, చూతము.

బైబిలు ఆదికాండ. 18-వ అధ్యాయము.

"22. వచనము. అయితే అబ్రహాము యింకా యెహోవా సన్ముఖమందు నిలుచుండెను.

23. అపుడు అబ్రహాము సమీపించి యిట్లనెను. దుష్టునితోకూడా నీతిమంతుని నాశనము చేయుదువా? అని అడిగెను." యెహోవా దుష్టులను సంహరించెదనని చెప్పియుండుటచేతనే ఆదుష్టులు నివసించెడి పట్టములో కొందఱు నీతిమంతులుండినపుడు వారినికూడ సంహరించుట న్యాయమా? యని ప్రశ్నించుట కవకాశమేర్పడెను.

దీనికి ప్రమాణము వినుము.

ఆదికాండ 19 అధ్యాయము.

24. అపుడు యెహోవా, సొదొమమీదను, గొమొఱ్ఱామీదను గంధకమును అగ్నిని, ఆకాశమునుండి కురిపించి ఆపట్టణమును ఆప్రాంతమును ఆపట్టణములో నివసించెడి వారినందఱిని నేలమొలకలను నాశముచేసెను.

బైబిలు. లేవియాకాండము, 26 అధ్యాయము.

(14 వ.) మీరు నామాటవినక ఈయాజ్ఞలన్నిటిని అనుసరించక (15 వ.) నా కట్టడలను నిరాకరించినను నాఆజ్ఞలన్నిటిని అనుసరించక నా నిబంధన మీరునట్లు మీ మనసు నాతీర్పులు అసహ్యించినను (16 వ.) అప్పుడు నేనుమీకు చేయునది ఏదనగా, కన్నులను క్షీణింపజేసి ప్రాణమును కుందించు, తాపజ్వరము, క్షయ, భయము మీ మీ దికి రప్పించెదను.............. (20 వ.) మీబలము ఉడిగిపోవును. మీభూమి ఫలించదు............(25 వ.) మీమీదికి ఖడ్గమురప్పించెదను. అది నానిబంధన కొరకు ప్రతిదండనచేయును. మీరు మీపట్టణములలో కూడియుండగా మీమధ్యకు తెగులుపంపెదను............(30 వ.) మీ ఉన్నతస్థలములను పాడుజేసెదను. మీ విగ్రహములను పడగొట్టెదను. మీబొమ్మల పీనుగులమీద మీపీనుగులను పడవేయించెదను (31 వ.) నేను మీపట్టణములను బీడుగాజేసెదను................(33 వ.) మీ వెంటను కత్తిదూసెదను. మీ దేశము పాడైపోవును. మీపట్టణములు బీడుగానుండును.

ఇటుల యెహోవా యనెడి దేవుడు దుష్టులను శిక్షించెడి స్వభావము కలవాడయ్యు తానుపంపిన క్రీస్తువునకు అట్టిశక్తి నొసంగకుండుటచే నతనికి, నతడేలాటిపుత్రుడో తెలియకున్నది. బైబిలునందు యెహోవా నేను దేవుడనని వచించి యుండినటుల శ్రీకృష్ణుడు భగవద్గీతయందు తానే దేవుడ(లోకకర్త)నని వచించియుండె. అందుకు తగినటుల యెహోవావలె శ్రీకృష్ణుడు దుష్టులసంహరించె. క్రీస్తు తాను దేవునిపుత్రుడ నని పలుకుట యొకవింతకాదు. మహిమయుకాదు. జనులందఱు దేవునిపుత్రులుగనె యుండిరి. ప్రతివాడును నేను దేవునిపుత్రుడననియు తనశక్తికి వంచనలేకుండునటుల లోకమునకు మేలొనరించెదననియు వచింప నరుహుడైయుండెను. గనుక క్రీస్తువుయొక్క అవతారముకంటె కృష్ణావతారమే యవసరమయ్యెను.

ఆ. బైబిలుగ్రంథమున, నొక మహాపురుషుడు లోకమునుద్ధరింప నవతరింపబోవుచున్నాడని చెప్పబడియుండెగాన నతడే క్రీస్తువుగ పుట్టెననుటకు సందియమేమి?

ఆ. లోకమునకు మహాపురుషుడు రావలసినమాట వాస్తవమేయగును. అతడు క్రీస్తువే యనుటకు ప్రమాణమెక్కడిది. ఆమహాపురుషుడు మహమ్మదుగా జన్మించెనని కొందఱనుచున్నారు. మఱికొందఱిక రానున్నాడని నిశ్చయించుచున్నారు. 2 క వేళ క్రీస్తువేయనుకొనినను ఆప్రమాణము బైబిలు గ్రంథమునను సరించిన వారికి సహజమై యుండు. వేదములు ప్రమాణముగల దేశమందు బైబిలుయొక్క శాసనము చెల్లనేరదు.

ప్ర. అవతారావశ్యకత దుష్టశిక్షణార్థమే యగునా? అట్లుగాక సుజనహిత బోధార్థము కాకూడదా?

ఉ. సుజనులకు సదుపదేశములు గావించుటకు అవతారము రావచ్చును కాని, అది పరిపూర్ణతమావతారము కాదు. కేవల కలావతారమగును. క్రీస్తు అట్టి కలావతారములలో చేరవచ్చును. అన్నివిధముల నెమ్మది గలిగియుండిన వారికి కలావతారము ప్రయోజనకరమగును. దుష్టులచే బాధింపబడు సాధుజనులు చిత్తశాంతిలేనివారై యుండ వారిని హితోపదేశమెటుల నుద్ధరించగలదు? దుష్టులచే కలిగెడి కష్టములు నష్టమయి నగాని సాధువులకు హితము చేకూరదు. సాధువుల బాధలు వినిన దేవదూతలు దేవుని జేరి సాధుజన సంకటములు విన్నవింప కుజనదండనార్థము అవతారమరుదెంచును.

భాగవతము. సప్తమస్కంధమ్.

మ॥ భయముం జెందకుడయ్య నిర్జరవరుల్ భద్రంబు, మీకయ్యెడుఁ
జయముఁ లాభము భూతసంతతికి మత్సందర్శన ప్రాప్తి న
వ్యయమై చేరు నెఱుంగుడుఁ, దితిసుత వ్యాపార భాషావిప
ర్యయముల్ గాలముగూడ జంపెద జనుం దంచాక మిత్రోవలన్॥ 110

ఆ॥ శుద్ధసాధులందు సురలందు శ్రుతులందు। గోవులందు విప్రకోటియందు। ధర్మ
పదవియందు దగిలి నాయందు వా। డెన్నడలుగువాడె హింసనొందు.

ఎవండు దుష్టప్రభువై సాధుజనుల బాధించునో; వేదప్రచారమును తగ్గించునో, బ్రాహ్మణ జీవనముల భంగము సేయునో, ధర్మపథను నతిక్రమించునో, అతడు తనచే చంపబడునని విష్ణువు పలికె.

ప్ర. శ్రీకృష్ణుని జన్మమును అతని చర్యలును అతని యుపదేశములును తెలిసికొనినపుడు అతడు పరపురుషుడగు భగవంతుడే యని తోచుటకు వీలుండెనా?

ఉ. వీలుకలదు. అతని జన్మాదిచరితమును, సక్రమముగ, శాంతముగ, వినయముగ వినినపుడు సాక్షాద్భగవంతుడు వేఱొకడు లేనేలేడని, నీవే వచించెదవు. లోకమున నొకనితత్వము గ్రహింపదలచినపుడు చరిత్రకారులతని గురించి వ్రాసినదాని ననుసరించి నిర్ణయింపనగు. దివ్యలోకము గురులోకము పండితలోకము ఆ పురుషుని గురించి పలికిన సందర్భములను మనము ప్రబలి ప్రమాణములుగ గైకొనవలెను. కృష్ణుడు జన్మించినపుడు అతని తల్లియాతనిని వర్ణించిన విధము చూడుము.

భాగవతం దశమస్కంధమ్.

మ॥ ఒంటినిల్చి పురాణయోగులు యోగమార్గనిరూఢులై
కంటిమందురుకాని నిక్కము కానరీభవదాకృతిం

గంటి భద్రముఁగంటి మాంసపుఁగన్నులంగన బోలరీ
తొంటిరూపు తొలంగబెట్టుము తోయజేక్షణ ప్రొక్కెదన్॥ 128

ఆ॥ విలయకాలమందు విశ్వంబు నీ పెద్ద । కడుపులోన దాచు కడిమిమేటి
నటుడవీవు నేడు నాగర్భజుడవౌట । పరమపురుష వేడబంబు గాదె ॥ 129

## తండ్రియగు వసుదేవునివచనము.

బ్రహ్మకైవర్తం—కృష్ణజన్మఖండము.

చ॥ శ్రుతులును శేషుడున్గుహుడు శూలియుబ్రహ్మయు గౌరియున్సర
స్వతియు గణేశుడు న్సురలు సర్వమునీంద్రులు మానవోత్తము
ల్చతురతనిన్నుతించుటకు జాలరు నేనిపుడెంతవాడ నీ
యతులితరూపముఁ విడిచి యచ్యుత చూపుము బాలరూపమున్॥

## గురువైన గర్గాచారునివచనము.

బ్రహ్మకైవర్తం కృ. ఖం.

ఉ॥ ఉల్లమునందు నీచరణయుగ్మముపై రతిదక్కనన్యమే
నొల్లను ముక్తిమార్గమదియొల్లగరంబణిమాదిసిద్ధుల
న్నొల్ల త్రిలోకరాట్పదవినొల్ల నిరంతరయోగచింతనం
బొల్లను నిర్జరత్వమదియొల్ల మనంబునజ్ఞానతత్త్వమున్॥

బ్రహ్మవచనము బ్ర. కై. కృ. ఖం.

చ॥ సనయుడుపద్మగర్భుడు ప్రసన్నముఖుండగు కృష్ణుజూచియో
వనజదళాక్షనీదు పదభక్తియె దక్షిణగానొసంగునా
కనవుడునవ్వి కృష్ణుడు దయామతినిచ్చితినింకనీవు నా
పనిచినదానిజేయుమిక భద్రముగల్గెడు బొమ్ము వీటికిన్॥

## ఋషులవచనము.

భాగవతం = ఏకాదశస్కంధం.

మ॥ ఒక్కవేళను సూక్ష్మరూపమునొందుదీవణుమాత్రమై
యొక్కవేళను స్థూలరూపమునొందుదంతయు నీవయై
పెక్కురూపులుదాల్తునీదగు పెంపుమాకనుతింపగా
నక్కజంబగుచున్నదేమన నంబుజాక్ష రమాపతీ॥

ఉద్ధవుడు నందునితో చెప్పినవిధము.

ఆ. జన్మకర్మములును జన్మంబులునులేవు శిష్టరక్షణంబుసేయు కొరకు
గుణవిరహితుడయ్యు గుణియయి సర్వరక్షణవినాశకేళిసలుపుచుండు॥

భాగ॥ దశ॥ పూ॥ 1445

## శ్రీ కృష్ణుడు తాను దేవుడనని చెప్పుట.

బ్రహ్మ.కై. కృ. ఖం. ప్రథమాశ్వాసము.

చ॥ చెలువుగ నే జగంబులసృజింపుదు బెంపుదు సంహరింపుదు
న్వలనుగ నాకు భక్తులగువారలధన్యుల నిత్యదేహులన్
దలపవధింపనోప ననుదప్పకగొల్చెడు నట్టిపాద భ
క్తులకడబాయకేనెపుడు దోచుదు తత్పరిరక్షణార్థమై॥

బ్ర. కై. కృ. ఖం. అష్టమాశ్వాసము.

చ. మునుకొని నాపయిందనయబుద్ధిద్యజించి ననున్బరా
తనునిగ జన్మమృత్యుభయతాపవిమోచనుగా బరేశుగా
ఘనతరకిర్మకుంతనునిగా భగవంతునిగా సమస్తలో
కనికర కర్తగాదలచి గాంచునునిత్యపదంబువల్లవా॥

గీ॥ ఏనుపురుషుండ బ్రకృతియు నేనయగుదు । బరగ స్వేచ్ఛామయుండనై వరలు నేను
తెలగిభక్తుల ధ్యానంబుసేయుకొరకు । దవిలిగుణమయదేహంబుదాల్తునబల॥

కృష్ణుడు సామాన్యపురుషుడైనచో ఇట్లు తల్లియు తండ్రి గురువు దేవతులు ఋషులు మొదలగువారు స్తుతించుట యసంభవము. నిజముగ దైవమేయగును.

అ. అయితే పైనుదహరింపబడిన నవవిధమార్గము లనుసరించెడివారికి యీకృష్ణుడు ముక్తినొసంగెనని చరిత్రాంశము కలదా?

ఆ. కలదు వినుము.

(1) భక్తిమార్గమున కృష్ణునిభజించి ముచికుందుడు, అక్రూరుడు, విదురుడు, భీష్ముడు మొదలగువారలు ధన్యులైరి.

భాగవతం = ప్రథమస్కంధం.

భక్తిమార్గమునకు ఉదాహరణము. భీష్ముడు వ. అనియిట్లు మనోవాగ్దర్శనంబుల పరమాత్ముండగు కృష్ణుని హృదయంబున నిలిపికొని నిశ్వాసంబుమాని నిరుపాధికంబయిన వాసుదేవ బ్రహ్మంబు నందుగలసిన భీష్మునింజూచి సర్వజనులు ......సూతునకు శౌనకుం. డిట్లనియె 227.

(2) ప్రేమమార్గము:—భార్యాభర్తలకుంగల ప్రేమ అతిశయమైనదేయైనను, కామపూరితమైయుండును. కామరహితమైయుండు ప్రేమ పుత్రప్రేమయే యని చెప్పదగు. పుత్రప్రేమచే దేవకీవసుదేవులున్ను నందయశోదాదులున్ను శ్రీ కృష్ణుని ప్రేమించి ముక్తి జెందిరి.

క॥ వెన్నునికొక పరివిషమగు చన్నిచ్చిన బాలహంత్రిజ నెనటదివికిన్
వెన్నునిగని పెంచుచు దన చన్నిచ్చినసతికిమరియు జన్మముగలదే!

241. భా. ద. పూ.

3. మిత్రమార్గము:—శ్రీకృష్ణునకు కుచేలుడు బాలస్నేహితుడు. అతనికి సర్వదారిద్ర్యవిచ్ఛేదన మొనర్చి పాపబంధములనుండి విడిపించె.

4. బంధుమార్గము:—బంధువులగు పాండవులపక్షమువహించి ఐహికపారమార్థిక స్వారాజ్యముల నొసంగె.

భాగవతం ప్రథమస్కంధం.

అర్జునుడు ధర్మజుని కిట్లనియె.

క॥ మనసారథి, మనసచివుడు । మనవియ్యము, మనసఖుండు, మనబాంధవుడున్
మనవిభుడు గురుడు దేవర । మనలను దిగనాడిచనియె మనుజాధీశా! 358

(5) భయమార్గము:—ఒకపుడు కంసుడు తన సోదరి యగు దేవకీదేవిని అత్తగారింటికి రథముపై తోడ్కొనిపోవుచుండ నాకాశవాణి "నీ చెలియలి యష్టమగర్భము నిను జంపు"నని పలికె.

భాగవతం. దశమస్కంధం. పూర్వభాగం.

వ॥ అని యిట్లాకాశవాణి పలికిన, నులికిపడి భోజకులపాంసనుండైన కంసుండు సంచలదంసుండై యడిదంబు జెడిదంబుగా బెఱికి.........దగ్గ. 24.

ఆ భయముచేతనే తన చెల్లెలిని చెఱసాలయందుంచి యష్టమగర్భమునకై నిరీక్షించుచుండె.

భాగవతం పూర్వ.

క॥ తిరుగుచు, గుడుచుచు, ద్రావుచు । నరుగుచు, గూర్చుండి, లేచు, చనవరతంబున్
హరిదలచితలచి జగమా । హరిమయమనిచూచె గంసు డాజునియందున్ 85

సీ॥ శ్రవణరంధ్రములనే శబ్దంబువినబడు నదిహరిరవమని యూలకించు।
నక్షిమార్గమున నెయ్యది సూడబడునది హరిమూర్తిగానోపు నంచుజూచు।
దిరుగుచో దేహంబు దృఢమైనసోకిన హరికరాఘాతమో యనుచునులుకు ।

గంధంబులేమైన ఘ్రాణంబునోకిన హరిమాలికా గంధమనుచు నదరు।
తే॥ బలుకులెవ్వరైన బలుకుచో హరిపేరు వలుకబడియెననుచు భ్రమసిపలుకు।
దలపులెట్టివైన దలచియా తలపులు, హరితలంపులనుచు నలుగదలచు॥ 86
క॥ చచ్చిన కుంభీంద్రంబును, వచ్చినబల మాధవులను వరుసంగని తా
నొచ్చిన చిత్తము తోడుత। జెచ్చెఱ, కడువెఱచె భోజసింహుండధిపా॥ 1324

కంసుండు క్రమక్రమమున భయాక్రాంతుండై నేమియు దోచక కృష్ణుడేవేళ తన్నుజంపునో యని తదేక ధ్యానమున, తిక మక పడి, ధనుర్యాగమిషచే కృష్ణుని రావించె. యాగమధ్యమున కృష్ణు డాధనున్నును విఱిచినపుడు కలిగిన శబ్దరవముచేతనే కంసుని గుండెలు తల్లడిల్లె. కృష్ణుడు కంససభామందిరమున ప్రవేశింప కంసునకు మతి భ్రమణముకలిగె. ఇంతలో కృష్ణుడు మదగజముపై సింహంబుమాడ్కి కంసునిపై దుమికి యతని ఖండించి తనలో చేర్చుకొనియె. రావణుడు రామునితో బోరి నటులను హిరణ్యకశిపుడు నృసింహుని డీకొనినటులను . . . . జరాసంధ కాలయవనులు శ్రీకృష్ణు నెదిరించి తఱిమినటులను, కంసుడే నాడును నెదు రాడలేదాయె. కృష్ణుడు పుట్టెనని తెలిసినది మొదలు తాను గిట్టువరకు భయమార్గమునే యనుసరించి కృష్ణపదవినధిష్ఠించె.

(6) సేవక మార్గము.

తన స్త్రీల కొఱకు తన క్షేమవార్తను పంపదలచి నపుడు తనకు భక్తుడును సేవకుడును అగువానిని నియమించుట, లోక ధర్మమైయుండు. కనుకనే కృష్ణుడు ఉద్ధవుని గోపకామినులకడకు దూతగా బంపియుండె. కుబ్జాగృహమున కేగినపుడు అతనిని వెంటబెట్టుకొని వెళ్లె. భారతయుద్ధ సందర్భములం, దుద్ధవునికి కార్యములు లేవుగాన, నతడు కృష్ణునికి తోడుగాలేదు. యుద్ధాంతమున, యదువంశ క్షయము సమీపించువేళ శ్రీకృష్ణ నిర్యాణము సమీపించుతఱి, దాసానుదాసుడగు నుద్ధవుడు మాత్రము సేవా పరతంత్రుడగుటచే యదువంశ వియోగ మోర్వజాలక కృష్ణా! నీ కంటె దిక్కులేదని విలపించె.

భాగ. ఏకాదశస్కంధం.

వ॥ ఇట్లు నుతియించి దేవా? నీవు యదుక్షయంబు గావించి, చనిన, నేమే విధంబున నిర్వహింతుము. నీ సహచరులమై జరిపిన మజ్జన భోజనాసనాది కృత్యంబులు మరువవచ్చునే యని యుద్ధవుండాడిన వాసుదేవుం డిట్లనియె . . . . . . . . . . . . . . . నాకర్ణింపుము॥ 90

అంత శ్రీకృష్ణుడధ్యాత్మిక ముపదేశించె. ఎట్టి శిష్యుడు సేవకుడును దాసుడును కానిది నిర్యాణ సమయమునకు పూర్వము కృష్ణునిచే పరీక్షింపబడి భగవత్సాక్షాత్కార మార్గముపదేశింప బడగలడు? కృష్ణుడు బాలుడై యుండగనె యుద్ధవు డతనికి సేవకుడై పరిచర్యసేయుచు భక్తుడైయుండె.

భాగవతం తృతీయస్కంధం.

వ॥ మున్ను కృష్ణునిగూడి యాడు బాలకులలో, నొకబాలుని కృష్ణునిగ భావించి పరిచర్యసేయుచుండ గుణవతీమతల్లియగు తల్లిసనుదెంచి యారొంటివిదియేల, రావన్న యనిపిలిచిన జననీవాక్యంబులు సైకొనక, యఖండతేజోనిధియైన పుండరీకాక్షు పాదారవింద మకరందసేవానురక్తిం జేసియున్న, యుద్ధవుండు నేడు.........డగుచు॥ 79

కృష్ణనిర్యాణానంతరము, విదురు డుద్ధవునిగూర్చి ముక్తిమార్గ మభిలషించినపుడు దాస్యలక్షణమునే సూచింపగలెగాని, స్వతంత్రముగాని యుపదేశింపడాయె. కేవల సేవకునకు స్వాతంత్ర్యధర్మము భారమైనదిగ దోచుట సహజమేకదా! ఉద్ధవ మైత్రేయు లిద్దఱు కృష్ణుని యుపదేశము వినియుండినను విదురున కుద్ధవుడు బోధింపజాలక యాపనిని మైత్రేయునిచే పూర్తిగావించెను.

7. వైరమార్గము:—స్త్రీ యొకసమయమున, పురుషుని హేళనముగ వైరోక్తు లాడినను; అవి ప్రేమమిళితములై యుండుననుట ప్రపంచవేద్యము. అటులనే యొక భక్తుడు వైరమార్గ మవలంబించి, తనపతియగు దేవుని నీచముగ మాట్లాడుటయు గలదు. ఆమాటలు బాహ్యార్థముగ జూచినపుడు దుర్భాషలవలె గోచరించునేకాని అంతరార్థమునజూడ ప్రేమాస్పదములై, భక్తిపూరితములై సరసవచోక్తులవలె రసవంతంబులై యుండు. ఈమార్గమవలంబించిన శిశుపాలుడు కృష్ణునియొక్క పాత్రతనుగూర్చి పలికిన వాక్యములయొక్క బాహ్యాంతరార్థముల గమనించిన తెలియగలదు.

భాగ. దశ. ఉత్తరభాగం.

సీ॥ గురుదేవశూన్యుండు కులగోత్రరహితుండు తలిదండ్రు లెవ్వరో తడవగాన।
మప్పులబోర లేడు నాదిమధ్యావసానంబులం దెఱయమానంబు లేదు।
బహురూపియై పెక్కుభంగుల వర్తించు నాని వర్తనములు పరుసలేవు।
పరికింప, విగతసంబంధుండు దలపోయ మానిమిత్తంబున మానిసయ్యె।
తే॥ బరగమున్ను యయాతిశాపమున జేసి, వాసికెక్కదు యీయదువంశమెల్ల ॥
బ్రహ్మతేజంబు నెల్లగోల్పడిన, యితడు బ్రహ్మఋషి సేవ్యుడగునె గోపాలకుండు॥ 790

క॥ జారుడు జన్మారహితుడును । జోరుడు మున్నోకలాడు సుమహితపూజా
చారక్రియలకు నర్హుడె । వారకనితడనుచు నశుభవాక్యనూన్రార్థ॥ 791

ఈపద్యములందు బాహ్యార్థము కృష్ణుడు నింద్యుడని తెలుపుచున్నది. అంతరార్థ మెంత పవిత్రమో విమర్శనముచే దెలియనగును.

గురుదేవశూన్యుండు = కృష్ణుడు భగవంతుడుగాన లోకైకగురువగు నాతనికి ప్రత్యేకగురువు లేడనుట యుక్తమేయగు. శ్రీకృష్ణుడు స్వయముగ దేవుడగుటచే నతనికి వేరొక దేవుడు లేకుండుటయె సిద్ధముగనుక నతడు గురుదేవశూన్యుడయ్యె.

కులగోత్రరహితుండు = జీవునియొక్క బుద్ధిభేదములబట్టి జాతి (కులము) లేర్ప డుచుండు. ఆకులములకు మూలపురుషుడగు జీవుని పేరుచే గోత్రమేర్పడు. దేవుని యొక్కబుద్ధిభేద మీవిధముననుండునని విమర్శింప తరముకాదు. బుద్ధిభేదము నిశ్చయింప బడనప్పుడు జాతి నిర్ణయ మశక్యము గనుక దేవుడు జాతి (కుల) రహితుడు. కుల మెపుడులేదో గోత్రమపుడు లేనిదేయగును. కృష్ణుడు దేవుడుకనుక కులగోత్ర రహితుం డయ్యె.

తలితండ్రులెవ్వరో తెలియరానను = జీవులను పుట్టించునది దేవుడుకనుక జీవులకు తండ్రి దేవుడైయుండును. దేవుని పుట్టించినవా డెవడునులేడు. అందుచే దేవునకు తండ్రి లేడు. కృష్ణుడును దేవుడగుటచే నతనికి తలిదండ్రు లెవ్వరునులేరనుట న్యాయమేయగు.

అప్పుల బొరలెడు = నీళ్ళయందు నివసించునని యర్థము. శత్రువులకు భయపడి భూభాగమున నివసింపజాలక సముద్రమధ్యమునజేరి యచట నొకద్వీపముచూచుకొని అందు ద్వారకాపట్టణమును నిర్మించుకొని కృష్ణుడు కాలముగడుపుచుండెనని బాహ్యార్థ మైయున్నది. శ్రీమహావిష్ణువు జలధిశయనుడనెడి సదభిప్రాయమును సూచించెడి నారాయణశబ్దము దేవునకు నీళ్ళయందు నివసించుట స్వభావమేయని నొక్కిచెప్పుచుం డుటచే, శ్రీకృష్ణుడు జలమందు వసించుట భావ్యమేయగును.

అరయ మానంబులేదు = మానాభిమానములు లేనివాడని బాహ్యార్థము. సం స్కృత భాషయందు మానశబ్దమునకు కొలతయని యర్థము కలదు. దేవునియొక్క పరి మాణమింతయని వర్ణింప నేరికిని సాధ్యముకాదు. అట్టివాడు మానహీనుడనబడు. అనగా (కొలత) లేనివాడగును. అతడే అపరిమితుడు. శ్రీకృష్ణుడు అపరిమితుడని యంతరార్థము.

బహురూపియై + వర్తించు = ఎవనికి సృష్టికర్తలేడో = ఉత్పత్తిలేదో తండ్రి లేడో, స్థలములేదో, హస్తములేదో, అట్టివానికి రూపముండుటయసంభవము. ఎప్పుడు

రూపములేదో అప్పుడావస్తువు సర్వరూపములందంత ర్యామియై యుండునని చెప్పక తీఱదు. రూపములన్నిటియందు వర్తించెడి వస్తువునకు ఆయారూపములన్నియు స్వస్వ రూపములే యని పేర్కొనవలెను. అపుడావస్తువు బహురూపముల వర్తించుచుండెనని సిద్ధాంతముచేయబడు. ఆ పరమ వస్తువు శ్రీకృష్ణరూపము ధరించి పెక్కుభంగుల వర్తించుట మహోత్కృష్టంబే యగును.

విగతసంబంధుండు = ఇతడు బంధువు, ఇతడుమిత్రుడు, ఇతడుశత్రువు, ఇతడులేన వాడు, ఇతడితరుడు అనెడి భేదములేక సర్వశూన్యుడై సంచరించెడి కఠినాత్ముడు అని బాహ్యార్థము. ఆపరమ వస్తువు సమస్త వస్తువులం దంతర్యామిగనుండుటచే వస్తువులన్నియు బంధురూపము లనుటకు సందియములేదు. కాని యీ వస్తువులు వృద్ధిపొందినపుడును నశించినపుడును ఆపరమవస్తువు, వృద్ధిబొందుటయు నశించుటయులేదు. ఈ వస్తువులయొక్క నాశనమునకు ఆసర్వాంతర్యామి చింతించుటయు లేదు. పరమాత్మ సర్వప్రపంచమునకు బంధువైయుండియు ప్రపంచప్రళయమనెడి బంధునాశనమునకు చింతించునని చెప్పగలమా? పరమాత్మ బంధురహితుడని మనమునిందింపగలమా? ఆపరమాత్మ శ్రీకృష్ణరూపము ధరించెగాన నితడు బంధుమధ్యమునందు వాడయ్యు బంధువులనిరోధించక దుష్టులసంహరించి విగతబంధుండయ్యెనని భావము.

మానిమిత్తంబున మాని సర్యో = శిశుపాలుడు దంతవక్త్రుడు కురు పాండవులు మొదలగు మహారాజులకు బంధువుడగుటచే శ్రీకృష్ణుడొక మనుష్యుడని లోకము వాడుకొనుచుండెనేకాని లేకయున్న నీతనికి గౌరవమువచ్చునా యని బాహ్యార్థము. పుట్టుకలేనిదేవుడు లోకోద్ధరణముకై యవతరించును. దేవునకు మానవశరీరమువచ్చుట లోకార్థమేకాని వాస్తవమున నతనికి జన్మకర్మాదులులేవు. (మానిమిత్తము) మమ్ముల నుద్ధరించునిమిత్తముమానిసయ్యె = మనుష్యుడైనేడు జన్మించెనని అంతరార్థము.

ఇటుల బాహ్యమున నశుభవాక్యములుగను అంతరమున శుభాస్పదములుగను సూచించెడిపదములు ప్రేమాతిశయమున హాళనార్థముచ్చరింపబడినవేయని సతీపతిధర్మ మెఱింగిన హితమతులకు తెలియనిదికాదు.

భాగ. సప్తమస్కంధం.

ఉ॥ వేసుడుమాధవుం దెగడి విప్రులుదిట్టిన భగ్నుడైతె మో
లీనుడుగాడెతొల్లిమదలిప్తుడు చైద్యుడు పిన్నవాటనుం
డేనిని మాధవుగా వినసహింపడు భక్తివహింపడట్టివా
డేనిబిడప్రభానమున నీపరమేశ్వరునందు జొచ్చెనో॥

మ॥ హరిసాధింతు హరిఁ గ్రసింతు హరి బాణాంతంబునొందింతునా
హరికై వైరినటంచు వీడుపట్టుగోపాయత్తుడై యెప్పుడుం
దిరుగుంబుప్పుడు నోరువీడిపడదా దేహంబుదాహంబుతో
పరకృప్తాప్తియునొంద డేక్రియుజగన్నాధుం బ్రవేశించెనో॥ 12

వ॥ అదియునుంగాక దంతవక్త్రుండును వీడును నిరంతరంబు గోవిందు నిందజే యుదురు. నిఖిలజనులు సందర్శింపనేడు వీనికి విష్ణుసాయుజ్యంబు కలుగుటకేమి హేతువు వినిపింపుము × × × × దూషణభూషణ తిరస్కారంబులు శరీరంబునకుగాని పరమా త్మకులేవు. శరీరాభిమానంబునం జేసి దండవాక్పారుష్యంబులు హింసయైతోచుతెఱంగున నేను నాయది యనియెడు వైషమ్యంబును భూతంబులకు శరీరంబునందు సంభవించు. అభి మానంబు బంధంబు. నిరభిమానుండై వధించినను వధంబుగాదు. కర్తృత్వమెల్లనివానికి హింసయు సిద్ధింపదు. సర్వభూతాత్మకుండైన యీశ్వరునికి వైషమ్యంబులేదుగావున. 13

ఇటుల వైరమార్గమవలంబించిన శిశుపాలునకు కృష్ణుడు ముక్తినొసంగె.

8 కామమార్గము = స్త్రీ పతినికామించి అతనియందభిరతి కలదైవర్తించు. అట్టిమార్గ మున ముక్తికి జేదలచిన పురుషుడు భగవంతునకు భార్యగానుండవలెనని నిశ్చయించి భగవంతుడు మానవశరీరమును దాల్చినపుడు ఆపురుషుడున్ను మరియొకజన్మమున స్త్రీజన్మ మెత్తి దేవునిపెండ్లాడి యతనిగొల్చిముక్తింజెందగలడు. పదాఱువేలమహాఋషులు దేవుని కి సతీమణులైయుండదలచి కృష్ణావతారమున గోపికాస్త్రీలైజన్మించి, యతని వరించి పరమపదము జెందిరి. అటులనేస్త్రీలుసయితము రూపముధరించినదేవునకు భార్యలుగా నుండదలంచి మరియొకజన్మమునగాని అదేజన్మమునగాని దేవునింగూడి సుఖించి పరమపద వింజెందవచ్చు. రామావతారమున, అయోధ్యా, మిథిలా, కోసలా, పంచవటీనివాసినులగు కొందరుస్త్రీలు భర్తలుకలవారయ్యు దేవునికి భార్యలుగనుండదలచి శ్రీరామునియాజ్ఞచే కృష్ణావతారమున అసంఖ్యాకగోపికాస్త్రీలై జన్మించి కృష్ణుని వరించి ముక్తింజెందిరి. రామావతారమున రావణుని చెల్లెలగు శూర్పణఖ తానుభార్యగానుండవలెనని శ్రీరాముని హెచ్చరింప నాతడుకృష్ణావతారమున కోర్కెదీర్చెదనని యభయమొసంగ నామె కుబ్జ యైపుట్టి శ్రీకృష్ణునిమహిమచే సుందరాంగియై యాతనింబొంది వైకుంఠలోకమునకేగె.

9 యోగమార్గము = స్త్రీ-తానెట్టిపనిచేయుచున్నను పతినిస్మరించుచు పతిజాడల రయుచు పతిదర్శనమభిలషించుచు నిత్యానుసంధాయినియై అన్యచింతనారహితయై పతిలోకముజేరుచందమున గొందఱుపురుషులు అనన్యమనస్కులై దైవధ్యానైకచిత్తులై

నిష్కామకర్మోపేతులై బ్రహ్మైకరతులై వర్తించుచు జన్మరాహిత్యమొందుదురు. శ్రీ కృష్ణునియుపదేశములలో నీయోగమార్గము ప్రధానత్వము వహించియున్నది.

శ్రీకృష్ణుడు—భగవద్గీత.

శ్లో॥ అనన్యాశ్చింతయంతోమాం॥ యేజనాఃపర్యుపాసతే
తేషాంనిత్యాభియుక్తానాం। యోగక్షేమంవహామ్యహం॥

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య । మామేకంశరణంవ్రజ॥

ఇతరచింతనముమాని యేపనిచేయుచున్నను నాపనియనితలంచి ఆకర్మఫలమంతయు నాకేయర్పించి తదితరధర్మములన్నియువర్జించి నన్నేశరణముపొందినపుడు అతని యోగ క్షేమములు నేనే కనుగొనెదనని గీతావచనము కలదు. ఈమార్గ మవలంబించిన భక్తులెం దరో శ్రీకృష్ణునకుంగలరు.

అ. సామాన్య మానవజన్మముల వలెగాక శ్రీకృష్ణ జన్మవిషయమున నిసుమంత యైన విశేషాంశముకలదా?

ఆ. సామాన్యులవలెగాక కృష్ణుడు నాల్గుచేతులుకలవాడైపుట్టెను. అదితిలకించి తలిదండ్రులగు దేవకీవసుదేవులు ఆశ్చర్యమొంది స్తుతించిరి.

భాగవతం = దశమ. పూర్వభాగం.

సీ॥ జలధరదేహు నాజాను చతుర్బాహు సరసీరుహాక్షు విశాలవక్షు
జారుగదాశంఖచక్రపద్మవిలాసు కంఠకౌస్తుభమణికాంతిభాసు
కమనీయకటిసూత్రకంకణకేయూరు శ్రీవత్సలాంఛనాంచితవిహారు
నురుకుండలప్రభాయుతకుంతలలలాటు వైడూర్యమణిగణవరకిరీటు॥

తే॥ బాలు పూర్ణేందురుచిజాలు భక్తలోకపాలు సుగుణాలవాలు గృపావిశాలు
జూచి తిలకించిపులకించి చోద్యమంది యుబ్బిచెలరేగి వసుదేవుడుత్సహించె। 112

ఇతడు పుట్టుటకుపూర్వమే దేవతులు దేవకీదేవికడకేగి గర్భముననున్నవాడు భగ వంతుడనియు నతనిజన్మముచే లోకమునకు మేలుచేకూరగలదనియు స్తుతించిరి.

భాగవతం. దశమ. పూర్వభాగం.

క॥ ముచ్చిలియున్నది లోకము నిచ్చలు గంసారిఖలులు నిర్దయులేచక్
మచ్చికకావగవలయును విచ్చేయుము తల్లికడుపువెడలి ముకుందా॥ 101

నిరాకారుడై సర్వభూతాంతర్యామియై యొప్పెడి పరమాత్మ సర్వభూతముల నుండి బయలువెడలి ప్రత్యక్షశరీరమును ధరించుటను గనినపుడు భూతములకెల్ల నొక

యథాకాలానందమొందదె. సముద్రములుపొంగె. చల్లనిగాలివీచె. దేవతలు పుష్పవర్షముల గురిపించిరి.

శంఖచక్రగదాయుతుడై చతుర్భుజుండై భగవత్తేజముచే నొప్పుచున్న కృష్ణ స్వరూపముంజూచి యాశ్చర్యపడి యాస్వరూపమును జ్ఞాడబాలక

"తొంటిరూపు తొలంగబెట్టుము తోయజేక్షణ మ్రొక్కెదన్"

అనితల్లిప్రార్థించెను.అపుడు కృష్ణుడాభగవద్రూపమునువిడిచి యొకబాలుడై కలింగ

క|| చెప్పలిడక తలిదండ్రులు దప్పక తనుజూడ, మాయదనరి, లలితుడై
యప్పుడటుగన్న పాపని యొప్పున వేడుకలుసేసె నొకకొన్నిపుడున్|| భా.ద.పూ.36.

ఇతడుపుట్టిన వెంటనే తలిదండ్రులకు వేయబడియున్న సంకెలలువీడె. ఆకారాగృహమున బంధింపబడియున్న ద్వారములన్నియు తెరువబడియె. తండ్రి యాబిడ్డను కారాగృహమునుండి తీసుకొని యమునానదినిదాట నిశ్చయించినపుడు ఆనది వారలకు త్రోవయొసంగె.

భాగవతం. దశమస్కంధం - పూర్వభాగం.

క|| ఆశౌరికి దెరువొసగె బ్రకాశోద్ధత తుంగ భంగకలితధరాశా
కాశయగుయమున మునుసీతేశునకు బయోధిత్రోవ నిచ్చినభంగిన్|| 144

అ. కృష్ణుడు దేవుడైనచో పుట్టినవెంటనే కంసభయమున జన్మస్థానమువదలి నందవ్రజమున నుంచబడుటకు కారణమేమి?

ఆ. బ్రహ్మవైవర్తం. సప్తమాశ్వాసము - ఉషాచరిత్ర.

వ. దురాత్మా............తొల్లి ద్రోణుండనువసువు తనపత్నియైన ధరాదేవి తోగూడి పెద్దకాలంబు దపంబుగావించిన మెచ్చి శ్రీకృష్ణుడు ప్రసన్నుండై మీకు పుత్రుండనయ్యెదనని వరంబొసంగె............ దానిచ్చిన వరంబుదప్పకుండ బుత్రభావంబున వారిగృహంబున (యశోద నందుల గృహమున) పెరిగె.

ఇటుల భక్తులకోర్కెలుదీర్చుటకై స్వస్థానమును విడచెనేకాని యన్యముకాదు. మరియు కారణములేని కార్యముచేయుటయు తగదు. కంసుడొక్కడేకాక యతని సహచరులెందరో చంపబడవలసియుండిరి. దేవకి, పుత్రుని గనెనని కంసుడు వినినపుడు తత్క్షణ మాపుత్రుని సంహరింపనేతెంచును. కంసుని చంపెనేని యతని సహచరులనందరిని కృష్ణుడకారణముగ చంపవలసివచ్చును. దేవకియందు పుత్రుడు జనింపలేదనియు, కంసుని జంపెడిబిడ్డ మరియొకచోట పెరుగుచుండెననియు

కంసునికి తెలిసినట్లే యీబిడ్డను చంపుటకై పూతనాది రాక్షసులబంపు నవకాశ మేర్పడు. ఇటుల రాక్షసులజంపి తుదకు కంసవధగావించుట కృష్ణునకు న్యాయమగు. అందుచే నతడు నందవ్రజముచేరె.

అ. పూతననుచంపిన కృష్ణునకు స్త్రీహత్యాదోషము సంభవింపదా?

ఆ. బాలకృష్ణునకు చన్నిచ్చెనుగాన, యామెయొక్క పాపములన్నియు భస్మముచేసి యా పాపశరీరమునుగూడ నశింపజేసి, యామెకు పరిశుద్ధతనొసంగి తనలో జేర్చుకొనెను. గాన వధాదోషముండెననుట వ్యర్థమగును.

భాగవతం. దశమ - పూర్వభాగం.

ఆ|| పొగిలిపొగిలి కాలం మగువదేహంబున । నగరుపరిమళముల పొగలు వెడలె
దేహకల్మషములు శ్రీహరిముఖమున । ద్రావబడుటజేసి భూవరేణ్య|| 239

క|| హరితనమీదంబదములు కరములు నిడి చన్నుగుడిచి కదిసినమాత్రన్
హరిజననిపగిది బరగతి కరిగెను దురితములుబాసి యసురాంగనయున్|| 240

అప్పుడు శ్రీకృష్ణునివయస్సు.

సీ|| కన్నులు దెఱవని కడుచిన్నపాపడై దానవిచనుబాలు ద్రాగిచంపె

భాగవతం. దశమ - పూర్వభాగం = 929 పద్యం 1-వ పాదము.

ఈపద్యముయొక్క రెండవపాదమున నితడు మూడు నెలల బాలుడనియుంటచే పూతననుజంపినపుడు మూడు నెలలకు లోబడిన వయస్సుండునని నిశ్చయమగుచున్నది.

అ. భక్తికలిగి చనుబాలొసంగినపుడు ముక్తికల్గుట న్యాయమగుగాని దురుద్దేశమున విషమొసంగిన పూతనకు మోక్షమబ్బుట విపరీతముకాదా?

ఆ. మనుష్యులకు పదార్థములందు మంచిచెడుగులు తోచుచుండుగాని భగవంతునకు పదార్థములన్నియు సమానములేయగును. విషముచే మానవుడు నశించుగాని భగవంతునకు విషమొక విషమస్థితిని చేయజాలదు. ఆపూతన కృష్ణునియందు లీనమగుటకై వైరమార్గముపూని విషమర్పించెనేకాని కృష్ణుడు దేవుడుగాడనెడి యభిప్రాయముచేగాదు. ఈపూతన కృష్ణునియందు పుత్రభావమేయుంచుకొనెనుగాని, శత్రుభావమును దల్చలేదు. భగవత్పదమును పొందుటకై యేర్పరచుకొనిన వైరమార్గమునకును భగవంతుని మఱచి బుద్ధిలేక బూనిన వైరమార్గమునకును, హస్తిమశకాంతము భేదముకలదు. భగవంతుడున్నాడని నిశ్చయించి భక్తిచే భజించి యతనిజెందుటకు విశేషకాలము పట్టునవియెంచి యాలస్యమున కోర్వజాలక ద్వేషించి యతనిచేజచ్చి యతనింజేరుట శ్రేయ

మని పూనెడి వైరమార్గము నాస్తికులయొక్క వైరమార్గమువంటిదని భావించరాదు. ఈపరమరహస్యమెఱుంగని నరులెందఱో తల్లక్రిందగుచుందురు.

ఇందుకు ప్రమాణము—భాగ. సప్తమ.

ఉ॥ వేనుడు మాధవుందెగడి విప్రులుదిట్టినభగ్నుడై తమో
లీనుడుగాడె, తొల్లిమదలిప్తుడు చైద్యుడు పిన్ననాటనుం
డేనిని మాధవున్ వినసహింపడు భక్తివహింప డట్టివా
డే నిబిడ ప్రభావమున నీ పరమేశ్వరునందు జొచ్చెనో............11

ఈ పద్యమునందు వేనుడనెడి రాజు నాస్తికుడై దేవుని ద్వేషించి యతడు విప్రశాపమున నశించి తమోలీనుడయ్యెననియు శిశుపాలుడు దేవుని ద్వేషించినను ఆస్తికుడై దేవుని జేరదలచెగాన నతడు తమోలీనుడు (నరకమందు గూలినవాడు) గాక కృష్ణునందు లీనమయ్యెననియు సిద్ధాంతము చేయబడినది.

అ. పూతనకు, కృష్ణునందు లీనము కావలెననెడి యభిప్రాయ ముండినటుల ప్రమాణమేమి ?

బ్రహ్మవైవర్తం. తృతీయాశ్వాసము. కృ. ఖండము.

క॥ దనుజాంగన యగు పూతన । యనిమిషులకు వందరాని యాహరిలోకం
బున కెట్లుచనియె హరిముఖ । మున వందగ నెట్లుచూచె నానతియీవే॥
వ॥ అని యడిగిన నారాయణుం డిట్లనియె.

చ॥ బలిమఖ వాటికట్లు మునువచ్చినవామను గాంచి ప్రీతితో
నలువుగ నన్నిశాటపతినందని సుందరి రత్నమాల సొం
పలరగ వాని నిట్టి సుగుణాకరుడైన సుతుండుగల్గిన
న్నెలగి యురంబున న్గదియజేర్చి కుచంబులబాలొసంగనే॥

చ॥ అని తలపోయ దాని మనసంత, యెఱింగి, రమేశ్వరుండు చ
య్యన బెలిజన్మమందు గృప, నాసతి దుగ్ధములాని, దానికి
స్తునత్కృప, ఘోరమాతృగతి, గ్రక్కున నిచ్చె హరిన్భజించియా
ఘనకచ ధన్యయయ్యె హరిగాంచిన వారికి జన్మమున్నదే॥

బలిచక్రవర్తిని యాచించుటకు వామనుడు వచ్చినపుడు బలికి కూతురగు రత్నమాల మహావిష్ణువగు వామనుని పుత్రుండుగ నుండునటుల సంకల్పించి పూతనయై జన్మించె గాన నేడు కృష్ణుడు పుత్రభావమున పూతనాస్తన్యమున

గ్రోలి ముక్తి నిచ్చె. భగవంతుని తనకు బిడ్డగాఁ గోరిన పూతనకు ఆయనయందు ద్వేషముం గనని రూపమును చెప్పజాలఁడు.

ఆ. మూడునెలలు నిండనట్టి బాలుఁడు గొప్ప రాక్షసియగు పూతనను చంపగల్గె ననుట లోకవిరుద్ధము కాదా ?

ఆ. కాదు. వినుము లోకకర్త యొక్క మహిమలు, బుద్ధికందనివై, యుక్తిక గ్రాహ్యములై యుండుననుట లోకానుభవముగ నున్నది. ఒకని యనుభవమున నసంభవమని తోఁచిన విషయము, మఱియొకరికి సులభమైయుండుట మనము చూచుచున్నాము. ఇట్లు లోకమంతయు విమర్శించినపుడు మనమేనాఁడును నిశ్చయించని = విశ్వసింపఁతగని స్థితులెన్నియో గోచరించగలవు. ప్రస్తుత నాగరిక ప్రపంచము పురాణములందలి యాకాశ విమానములను కవికల్పనము లనియు సృష్టివిరుద్ధములనియు పలుకుచు నేఁడు జర్మనీవారి విమానసృష్టివైచిత్ర్యము కనులారఁజూచి పురాణములు విశ్వసింపదగినవియే యని నిశ్చయించుటలేదా ! శంఖ చక్రగదాది చతుర్భుజంబులుఁగలిగి జనించిన మహామూర్తి నేఁడు, తల్లి యాజ్ఞచే బాలరూపము ధరించెనేకాని, పెద్దలలో పెద్దయై చిన్నలలో చిన్నయై సర్వశక్తియుతుఁడై యుండెననుట కాక్షేపములేదు. సముద్రమథనమున జనించిన హాలాహలమును సాంబశివుఁడు మ్రింగుట యెట్టిదో, అందు స్వల్పభాగమైన విషమును శ్రీ కృష్ణుఁడు పీల్చుటయు నట్టిదేయగును. ఇదియొక వింతకాదు.

ఆ. కృష్ణుఁడొనర్చిన మఱియొక యద్భుతమేదైన గలదా ?

ఆ. కృష్ణుఁడు మూడునెలల బాలుండైనపుడు బండియాకారము ధరించినట్టి శకటాసురుడనెడివాఁడు కృష్ణుని కపకారము చేయఁదలంచెను. బాలుఁడా శకటమును దన్ని భగ్నమొనర్చె

భాగవతము. దశమ—పూర్వ

క॥ శకటము హరి దన్నిన దివి । బ్రకటంబై యెగసి యిరుసు ధరమున గండ్లున్
వికటంబుగ నేలంబడె । నకటా యని గోపబృంద మాశ్చర్యపడన్ ॥ 251

ఆ. శకటాసురుఁడు కృష్ణునిచే చంపఁబడి పాపవిముక్తిం జెందెనా ?

ఆ. హిరణ్యాకశిపుని పుత్రుఁడగు ఉత్కచుఁడనువాఁడు లోమశమహాఋషి యొక్క తపోవనమందలి వృక్షముల నాశము చేయుచుండె. ఋషిదానిఁగని ఓరాక్షసాధమా! విదేహుఁడవు గమ్మని శపించె. ఆరక్కసుఁడు భయపడి పాపవిముక్తిం జేయుమన నీచాక్షుషమన్వంతరంబంతయు నీకీ పాపానుభవము తప్పదనియు, వైవస్వతమన్వంతరమున శకటాసురుఁడవై పుట్టి శ్రీ కృష్ణుని పాదస్పర్శముచే పాపమోచనుండ వయ్యెదవ

నిదియు శాపవిముక్తి. ఆ కారణమున నతఁడు పరిశుద్ధుఁడయ్యె. అప్పుడు కృష్ణువయస్సు

సీ॥ మూఁడవ నెలనాఁడు ముద్దులబాలుండై కోపించి శకటంబు గూలఁదన్ని

భా. ద. పూ. 929 పద్యం 2 వ పాదము.

ఆ. పిమ్మట జరిగిన మఱియొక వృత్తాంతము వింతయైనది కలదా?

ఆ. ఒకప్పుడు తృణావర్తుఁడనెడి రాక్షసుఁడు సుడిగాలియై కృష్ణు నెత్తుకొనిపోవ, నతని బలమునణచి, వెలవెలబోవఁజేసి, పుడమిం గూల్చి, తనలోఁ జేర్చుకొనియె.

బ్రహ్మవైవర్తం. కృష్ణజన్మఖండము. ద్వితీయా.

క॥ పాపపు రక్కసుఁ డత్తఱి । నూపిరి ద్రిప్పుకొనలేక యుర్వింబడి తా
నాపోవుచు మృతినొంది ర । మాపతిలోకమున కరిగె మణిరథగతుఁడై॥

తే॥ గీ॥ అనఘచారిత్ర పాండ్య దేశాధి విభుఁడు। పరగ దుర్వాసు శాపంబువలన దైత్య
జాతిజన్మించి హరిపదస్పర్శనమున । మొనసి పూతుఁడై భూలోకమునకు జనియె॥

పాండ్యదేశాధిపతి దూర్వాసుచే నొకప్పుడు శపింపబడి తృణావర్తుఁడై పుట్టి యా పాపమునుండి నేఁడు విముక్తుఁడయ్యె.

ఇపుడు కృష్ణునకు వయస్సు........భాగ. దశ. పూర్వ.

సీ॥ నేఁడాదికుఁడై యొగసి తృణావర్తు మెడబట్టుకొని కూల్చి మృతుని జేసె॥

929 పద్యం, 3-వ పాదము.

ఆ. ఆపిమ్మట కృష్ణుని బాలక్రీడలు భగవన్మహిమను వెల్లడిచేయునట్టివిగా నుండెనా?

ఆ. సీ॥ జననాథ యొకనాఁడు చన్నుసేపిన దల్లి చిన్నిముద్దులకృష్ణు చేరదిగిచి
యెత్తి పెందొడలపై నిడికొని ముద్దాడి చన్నిచ్చి నెమ్మోము చక్కనిమిరి
యల్లనినగవుతో నావులించినబాలు వదనగహ్వరమునఁ వారినిధులు
దిశలు భూమియు వనద్వీపశైలంబులు నేఱులు గాలియు నినుఁడు శశియు
దహనుఁడాకసంబు దారలు గ్రహములు । నఖిలలోకములు జరాచరంబు
లైన భూతగణములన్నియునుండుట । జూచి కన్నుమోడ్చి చోద్యపడియె॥

భాగ. దశ. పూర్వ. 280.

తల్లి పాలిచ్చు సమయమున కృష్ణుఁ డావలింపగా సర్వప్రపంచమాతని నోటియం దుఁగనఁబడెను.

## కృష్ణుని బాలక్రీడలు.

క॥ అవ్వలనెఱుగక ముప్వురి । కవ్వల వెలుఁగొందు పరము దర్శకుఁడై యీ
యవ్వలకు సంతసంబుగ । నవ్వాయవ్వాయనంగ నల్లన నేర్చెన్॥ భా. ద. పూ. 294

క॥ అడుగులు వేగలిగియు రెం । డడుగులనే మన్నుమిన్ను నలమిన బాలుం
డడుగిడ దొడగెను శాత్రవు । లడుగులు నడుగులును వదలి యడుగవనిబడన్॥ 295

ఇటుల మాటలాడుటయు, నడుచుటయు, ఆడుకొనుచుండుటయు నేర్చుకొనుచుండె.

## శ్రీకృష్ణుని యాటలు.

సీ॥ గోవల్లభుఁడ నేను గోవులు మీరని వడిఱంకె వైచుచు వంగియాడు
రాజు నే భటులు మీరలు రండు రండని ప్రాభవంబున బెక్కు పనులవనుచు
నేదస్కరుండ మీ రింటివారని, నిద్రవుచ్చి సొమ్ములంగొని పోయి డాగు
నేసూత్రధారి మీ రందరు బహురూపులని చెలంగుచు నాటలాడ బెట్టు

తే॥ మూల, లఱుకును, దాగిలిమూతలాడు । నుయ్యాలలనూగు చేబంతులాడనర వైచు
జారచోరుల జాడల జాలనిగుడు శౌరి బాలుగతోనాడు సమయమందు॥ 305

(1) గోవల్లభుఁడ నేను గోవులు మీరు =

గోశబ్దమునకు భూమియనెడి యర్థముకలదు. భూమియనగా పుట్టించునది. పుట్టించునట్టి వస్తువు ప్రకృతియనబడును. సమస్త ప్రకృతి స్వరూపములకు అధిపతి (వల్లభుఁడు) నేనేయని శ్రీకృష్ణుడు తనయొక్క భగవత్స్వరూపమును ప్రకటించెను.

గోశబ్దమునకు = ఇంద్రియమనెడి వేఱొక యర్థము కలదు. నేను ఇంద్రియాధిపతి యగు నాత్మస్వరూపుడనియు సూచించెను.

(2) నేతస్కరుండ + మీరింటివారు

ఈశరీరమే గృహమనియు ఈగృహము నాది నాదియని తలంచెడి జీవుడు యింటియజమానుడనియు, ఈయజమానుడు శరీరరక్షణార్థము ధనాధికము నెంతయో సంపాదించి యందభిమానియై, వానిని విడనాడజాలక, తదైకనిమగ్నుడై కష్టపడుచుండు ననియు, లోకానుభవమున నున్నది. ఆజీవుడు నిద్రనుజెందనేని ఆధనమంతయు నుండె ననికాని, అది యిప్పుడు కనుపడలేదేమియనికాని, యెఱుగజాలడు. ఆయాకాపాత్రుడగు జీవునియొక్క ధనము ఆనిద్రాసమయమున స్ఫురించకపోవుటచే నదియేమయ్యెనని

ప్రశ్నింతము. అదినశించెనా? లేదు! ఉండిన స్ఫురింపదేమి? మెలకువవచ్చినపుడు స్ఫురించుచున్నది. కనుక నశించలేదనుట వాస్తవము. స్ఫురించకయు నశించకయు నుండునట్టి వస్తువుయొక్క స్థితియెట్టిదనిచెప్ప నర్హమగునో యోచింతము. దాని నితరుడెవ్వడైన దాచియుంచవలెను. లేదా దానిని గ్రహింపలేకుండునటుల మనస్సునైనను దొంగిలించవలెను. ఒకవస్తువు మఱియొకనికి తెలియకుండునటుల దాచిపెట్టుట దొంగతనమగును. దొంగిలించిన వస్తువును తిరిగి యివ్వవలెననెడి యూహ చోరునకుండదు. అట్టిచోరునకును మేల్కొనువఱకు మాత్రము దొంగతనముగ దాచిపెట్టి పిమ్మట యిచ్చునట్టి దొంగకును విశేషభేదముకలదు. ఈ రెండవవాడు నామమాత్రుడేకాని, వాస్తవచోరుడు కాజాలడు. నిద్రాసమయమున జీవునిధన మపహరించి మేల్కొనినతోడనే తిరిగి యిచ్చుచుండెడి యాక్రొత్తదొంగ, యీ యద్భుతచోరుడు, యీలీలామనుజుడు, యీవేషధారి అపకారియనబడడు. ఈవిధమున జీవుని నిద్రబుచ్చి యతనిధనమునుండి విడిచిచ్చునట్టి ప్రముచ్చిలి యెవడో తెలియదలచినపుడు ఆతడు పరమాత్మయేయని సిద్ధాంతము చేయవలసియుండు.' ఆపరమాత్మ జీవునకు కీడుసేయనిదొంగగా నుండెడినని వచించుట కెవ్వరికిని భయముండజాలదు. కృష్ణుడట్టి యాత్మస్వరూపము తానెయని యీపాదము దుపదేశించెను.

"నిద్రబుచ్చి సొమ్ములుగొనిపోయిడాగు."

ఏడాది యీడుగలబాలుడు సొమ్ములపహరించులేడ? తస్కరుండనెడి బిరుదము పొందులేడ? ఆవయస్సునందు, చేయబడిన దొంగతన, మెంతనిజమో, అట్టివానికి చోరుడనెడి నామ మెంత సార్థకమో, లోకమే తెలుసుకొనగలదు. ఈ దొంగతనము చేయుచున్న బాలకృష్ణుడాయా సమయములందు వ్యభిచరించి జారుడనబడుటయు పైదానివలెనే, నమ్మదగియుండు. ఈ 305 వ పద్యములో దాగిలిమూతలాడుచు, నుయ్యాలలనూగుచు, చేబంతు లెగురవైచుచున్నట్టి స్థితివర్ణింపబడుటయేగాక బాలురతో నాడుచు, జారచోరులజాడలబోలి వర్తించుచుండెనని నుడువబడె.

గోపికలంగూడి క్రీడించుట.

వెంటనే 307 వ పద్యములో కృష్ణుడు జారుడనియు గోపికలగూడి దుడుకుపనులు జేసెననియు కొందఱు గోపికలు యశోదాదేవితో విన్నవించినటులున్నది. ఏడాది వయస్సుగల బాలుడు వ్యభిచరించెననుట విని వివేకలోక మినుమంతయైన విశ్వసింప

జాలదు. ఆవ్యభిచారమునకేదో అంతరార్థముండితీరవలెను. భగవద్భక్తిశయనెడి పుస్తకయున చూడుడు.

### మృగపక్షులవలె గూయుట.

సీ॥ కలకంఠి............॥

ఆ॥ నోకటవెక్కిరించు నొకొక్కకచో మృగపక్షిఘోషణములు పరగఁజేయు
నిట్టుసేసి వెనుకనెక్కడఁబోవునో కానరాడు రిత్తకడవలుండు॥ భా. ద. పూ. 327

### విశ్వరూప ప్రదర్శనము.

ఒకనాడు బలరామకృష్ణులు గోపకుమారులగూడి యాడుకొను సమయమున కృష్ణుడు, మన్నుదినెనని, యశోదతో బాలురందఱును తెలిపిరి. తల్లి యాబిడ్డను పిలిచి నోరు తెఱచిచూచె. భాగవతం దశమ. పూర్వ.

క॥ ఆలలితాంగి కనుంగొనె । బాలుని ముఖమందు జలధిపర్వత వనభూ
గోళశిఖి తరణి శశిదిక్పాలాది । కరండమైన బ్రహ్మాండంబున్॥........340

ఈక్రింది విధమున స్తుతించె.

ఆ॥ బాలమాత్రుడగు సలీలుని ముఖమందు । విశ్వమెల్ల నెట్లు వెలసియుండు
బాలుభంగి నితడు భాసిల్లుగాని స । ర్వాత్ముఁడాది విష్ణుఁడగుట నిజము. 343

ఈ పద్యమువలన నీతడు దేవుడని నిశ్చయమగుచున్నది.

### వెన్నుడు వెన్నను భక్షించుట.

ఒకనాడింటిలో వెన్నంతయు దిని, తల్లికి దెలియకుండినటుల నెచ్చటికో బోయె. తల్లి వెదకి వెదకి తుదకతని బట్టి ఱోలంగట్ట నెంచియిట్లనియె.

క॥ ఎక్కడనైనను దిరిగెద । వొక్కయెడన్ గుణము కలిగియుండవు నియమం
బెక్కడిది నీకు, మఱచిన । జక్కగబోయెదవు పెక్కుబాదల బుత్రా॥ 376

(1) ఎక్కడనైనను దిరిగెదవు = దేవున కొక్కచోట తావులేదనియు, సర్వమ యుండనియు సూచింపబడెను.

(2) ఒక్కయెడన్ గుణము గలిగియుండవు = గుణము లేనివాడవగ, సత్త్వరజస్తమో గుణంబుల కతీతుడని యర్థము. ఇందు దేవుడు నిర్గుణుండని సూచింపబడె.

(3) నియమంబెక్కడిది = నియమము = హద్దు. అది (పరిమితి) లేనివాడు అపరిమితుడనబడు, పంచభూతములవలెను, జీవులవలెను, కొన్నినియమములకు లోబడ నేరడని భావము.

(4) మఱచిన జక్కఁగఁబోయెదవు = అవిచ్ఛిన్న తైలధారవలె, ఎడతెగక పాఱెడు నీరువలె నిరంతర ధ్యానమున ఆ పరమాత్మను వీక్షించుచుండినపుడే, యాతని దర్శనము లభింపగలదుగాని, నిమిషమాత్రమైన నాతని భజించుట మానితిమేని యాతడు మనస్సునకగోచరుండై యెచ్చటికో బోవుచుండునని ధ్యానపద్ధతి సూచించబడెను.

ఈ పద్యార్థము మామూలుగ తల్లులు తమపిల్లల, నదలించెడి మాటలవలె నెంచరాదని, సూచించుటకై 378 వ, వచనములో "అని మర్మంబులెత్తి పలికి" యని వ్రాయబడెను. పద్యార్థమును మర్మంబుగ = అంతరార్థముగ గ్రహింపవలసినదని యర్థమగుచున్నది.

వేదము యొక్క కర్మభాగమవలంబించి, తత్ఫలమంతయు భగవంతుని కర్పించి, తుదకు వేదము యొక్క ఉపనిషద్భాగమునజేరి, యా భగవంతుని పట్టి కట్టివేయగలమని, యశోద ఉదాహరణ రూపమున వెల్లడించె. పాలనుకాచి తోడుపెట్టి కవ్వముచే చిలికి, తత్సారమగు నవనీతమెంతయో, సముపార్జించుట యెట్టిదన, జీవుడు కర్మభాగముచే మహాపుణ్యమును మూటగట్టుట వంటిదని పోల్చబడినది. నవనీత మంతయు శ్రీ కృష్ణుడు భుజించుట యెట్టిదన, కర్మఫలమంతయు భగవదర్పణముచేయుట వంటిదని భావము. వెన్న దినిన పిమ్మటనే శ్రీ కృష్ణుడు యశోదచే కట్టివేయబడెనని చెప్పుటచూడ కర్మఫలమంతయు కృష్ణార్పణముగ జేసిన పిమ్మటనే, దేవుడు మనచే జిక్కునని నిర్ణయింపబడు చున్నది.

మద్దిచెట్లను విరుగగొట్టుట.

జీవుడు బ్రహ్మమును చేపట్టిన పిమ్మట స్వార్థత్యాగియై పరులనుద్ధరించెడి, స్వభావము కలవాడై యుండవలెనని, సూచించుటకు ఱోలునందు కట్టబడిన కృష్ణుడు యశోదచే నొసంగబడిన ఱోలును సాధనముగ జేసికొని రెండు మద్దిచెట్లకు పట్టించి లాగివైచి, విఱిచె........................................................

వ|| ఇట్లు నిర్మూలంబులయి పడిన సాలంబులలోనుండి కీలకీలలు వెల్వడు పోలిక నెక్కుడు తేజంబున దిక్కులు పిక్కటిల్లం బ్రసిద్ధులైన, సిద్ధులిద్దఱు, వెడలివచ్చి ప్రబుద్ధులై భక్తలోక పాలకుండైన బాలకునకు (కృష్ణునకు) మ్రొక్కిలేచి కరకమలంబులు మొగిచి యిట్లనిరి. 402

ఒకపుడు కుబేరుని పుత్రుడైన నలకూబరుడు బహిరంగముగ రంభతో శయనించియుండ, దేవలముని దానింగని నిర్భయముగ మొద్దులవలె నిచట పడియుంట తగదని

హెచ్చరించి యీపాపకార్యము యొక్క ఫలమనుభవింప మద్దివృక్షమై పుట్టుమని యతని శపించె. అతని తమ్ముడగు, మణిగ్రీవుడు మందాకినీ తీరమున స్త్రీలతో క్రీడించుచుండ నారదుండది గాంచి సిగ్గులేక జంటలుగా వర్తించుట భావ్యమాయని హెచ్చరించి మద్దిచెట్టగుమని శపించె. ఆ మహాపాపముచే విజ్ఞానధనము గోల్పోయిన, నలకూబరమణిగ్రీవుల కుపకారము సేయదలచి, చెట్లను విఱిచి వారిని స్వస్వరూపులుగ జేసి శ్రీకృష్ణుడు పరోపకారధర్మమును బ్రహ్మజ్ఞులకు బోధించె.

అ. ఈక్రీడలు ముగియునప్పటికి కృష్ణునకు వయస్సెంత ?

ఆ. రమారమి మూడు వత్సరములై యుండును.

అ. మూడు వత్సరములు ముగిసిన పిమ్మట కృష్ణవృత్తాంతమేమి?

## బృందావన నిర్మాణము.

ఆ. నందునకు నివాసస్థలము రేపల్లె. (బృహద్వనము). దానికి సమీపమున రమణీయమై సస్యాఢ్యమై, సుందరవృక్షసాంద్రమై, జలయోగ్యమై కాళిందీనద ప్రాంతమై యొప్పెడి బృందావనమనెడి స్థలముకలదు. అందు వసించుట సుఖముగనుంటచే నందుడు బంధువులగూడి బృందావనముచేరె. విశ్వకర్మచే పురనిర్మాణము చేయబడెను.

అ. బృందావన ప్రవేశానంతరము శ్రీకృష్ణుని బాలక్రీడలు, మహాపురుషుని సూచించునట్టివిగ నుండెనా?

### వత్సాసురవధ

ఆ. "అద్రోణుఁడు వైశ్యకులంబున నందుండై యాతనిపత్ని యశోదయై పుట్టిరి" అని కృష్ణజన్మ ఖండముననున్నది. గనుక వైశ్యునియింట క్షత్రియుడగు కృష్ణుడు భుజించుట న్యాయమైయని అనిరుద్ధుడు బాణునకు ప్రత్యుత్తరమిచ్చె. వైశ్యవృత్తి గోరక్షణమగుటచే కృష్ణుడు గోవత్సములను మేపుటకు గోపకుమారులతోకూడి యడవికిం బోవుచుండెడివాడు. వత్సాసురుడను రక్కసు డొక లేగదూడయై కృష్ణుడు మేపుచున్న లేగలలో జేరి గోపకుమారుల బాధుచుచుండ కృష్ణుడది కపటవేషమని యెఱింగి యావత్సమును బరిమార్చెను. మురకుమారుడగు ప్రమీలుడు దేవతులజయించి గర్వమొంది వశిష్ఠాశ్రమము జేరి అందుండెడి నందినియను ధేనువును నపహరింపదలచి బ్రాహ్మణవేషము ధరించి ఋషినియాచించె. కపటరూపమును గుర్తించిన ఋషి యతనింజూచి గోవుకై యాసించితివి గాన గోవత్సముగ నుండుమని శపించె. కృష్ణ

యిద్దరలో గలసినపుడు వత్సరూపమునశించి పాపవిముక్తుడ వయ్యెదవని శాపపరిహార మొసంగెను. గాన నతడిపుడు వధింపబడియె.

బకాసురవధ

హయగ్రీవుడను రాక్షసునకుకుమారుడు ఉత్కలుడనువాడు గర్వించి సింధుసాగర సంగమంబునంగల జాబాలి ఋష్యాశ్రమమునకు సమీపమున, చేపలంబట్టుచుండ ఋషి యా జీవహింసను చూడజాలక యాతని నివారించినను, వినడయ్యె. మత్స్యములను దినుపని, మనుజున కనుచితంబనియు, వాని మ్రింగెడి పని కొంగలదనియు దలచి యాతనిని బకముగా పడియుండుమని శపించె. అతడు బకాసురుండై కృష్ణుని మ్రింగబోయి యతనిచే జంపబడి పాపవిముక్తుడై స్వస్వరూపమునొందె.

అఘాసురవధ.

అష్టావక్రుడనుమునితపము సేయుతరి యతనింజూచి అఘాసురుండనువాడు మహాఋషీ! నీకుఎనిమిది వంకలున్న వే తపముగూడ సేయుచుంటివా యనిపరిహసించె. ఋషి యతనిమదము వదలింపదలచి వక్రశరీరముండుట హేయమనితలచెడినీకు వక్రముగనడిచెడి స్వభావముగల సర్పాకారములభించుగాకని శపించె. అతడు సర్పమైపాపమను భవించుచు కృష్ణుడు గోగోపులతో నరణ్యమునదిరుగు సమయమున వారలగని కృష్ణునిచే వధింపబడి యామహాత్మునందు లీనమయ్యె

ఉ॥ ఆ పెనుబాముమేన నొకయద్భుతమైన వెలుంగుదిక్కులో
దీపకమైవడిన్ వెడలిదేవపథంబున దేజరిల్లుచుం
గోపులబాలురున్ బెదర గృష్ణుని దేహమువచ్చిజొచ్చెనా
పాపమునొచ్చి ప్రాణములు బాపినయంతనశుద్ధ సత్వమై॥

ఎచ్చటనొక్కొక్క రాక్షసుడు కృష్ణునిచే జంపబడెనని, వచింపబడెనో అప్రతి రాక్షసుడు పాపవిముక్తుడై స్వస్వరూపమును జెందుటయో శ్రీకృష్ణు నందులీనమగుట యో! వర్ణింపబడుచున్నది. శ్రీకృష్ణులెందరినో చంపుచుండెనని విలపించుటమాని చంపబడినవారెల్ల నున్నతస్థితికి వచ్చుచుండిరని సంతసించుటమంచిది. ఇప్పటికి శ్రీకృష్ణుని వయసు౫.

వ॥ అంతనయ్యాజగర (అఘాసుర) చర్మంబుగొన్నిదివసంబుల కొండిబెద్దకాలంబు గోపాలబాలురకును గేళీబిలంబైయుండె నిట్లుకౌమారవిహారంబున నైదవయేట కృష్ణుం డఘాసురునిందెగ జూచుటయు ..............కిట్లనియె

ఆ పంచాబ్దంబులు దాటినపిమ్మట కృష్ణుడు చిత్రములగు క్రీడలగావించెనా?

ఆ కృష్ణుడుగోపబాలకులతోఁగూడి యరణ్యమున చల్దులారగించుచుండ చతుర్ముఖుండు గోవత్సములను గోపబాలకునుమాయముచేసె.

కృష్ణుడదియెఱిగి నూతనగోపబాలక గోవత్సములను సృజించి యొకవత్సరము గడపె.

క॥ గోపాలసుతులు లేరని గోపికలకు జెప్పనేల గోపాలకులుఁ
గోపికలునలరి బాలుర క్రేపులరూపములనే జరించెదననుచుఁ॥ 510

క॥ రూపంబులెల్లనగుబహు రూపకుడిటు బాలవత్సరూపంబులతో
నేపారుటేమిచోద్యము రూపింపగనతని కితరరూపముగలదే॥ 51

క॥ మరలుపుమనియెడుకర్తయు మరలించుకుమారకులునుమరలెడిక్రేపుల్
పరికింపదానయైహరి మరలంజనెలీలతోడ మందకునధిపా॥ 513

ఇచ్చటగడపబడిన వత్సరము ఆచతుర్ముఖున కొకత్రుటిమాత్రమయ్యె. కృష్ణుడొనర్చిననూతన సృష్టినిగని మాయముచేసినవానినన్నిటిని తిరిగిదెచ్చియిచ్చె. కృష్ణుడు సృజించిన నూతనస్వరూపములన్నియు వెంటనేమటుమాయములయ్యె. ఇందు శ్రీకృష్ణుడు సర్వజీవులకు సృష్టికర్తయని నిశ్చయమగుచున్నది.

## ధేనుకాసుర వధ

ఇతడొక వనమున వసించుచు నచటికేగిన నరుల జంపుచుండెడివాడు. కృష్ణుడదివిని బలభద్రునిచే నతని జంపించెను.

### కాళీయభయవిమోచనము.

కాళియుడొక గొప్పసర్పరాజు. గరుత్మంతునిభయముచే కాళిందిమడుగున దాగియుండె. మహామృగంబులు పయితము ఆమడుగునకు సమీపించినపుడు సర్పవిష జ్వాలలచే మృతిజెందుచుండెడివి. అట్టితరి గోవత్సము లా మడుగును సమీపించి మృతిజెందె. కృష్ణు డాసర్పప్రభావమునుగని మడుగున దుమికెను. సర్పముకఱచినదిగాని కృష్ణుడు నిర్భయముగ దానినోడ లిఱుగగొట్టి శరీరముపైకెక్కి పదతాండవముచే శిరమ్మునదలి విషమంతయు గ్రక్కించె. కాళింగుని భార్యలు పతిభిక్షమొసంగుమని ప్రార్థించుటచే నతనివిడిపించి యనుగ్రహించె. ఇదిమొదలీ హ్రదమునమండినచో జీవజంతువులెన్నియో హింసింపబడునని జీవరక్షణార్థము నీవీమడుగునువీడి రమణకద్వీపమున నుండుమని బనిచె. గరుడునియొక్క భయములేకుండునని వరమిచ్చె.

## కృష్ణుడు కార్చిచ్చును మ్రింగుట.

ఒకప్పు డరణ్యమున గోగోపసహితుడై చరించుచుండ వారల గార్చిచ్చుచుట్టుకొనెను. కృష్ణునిమహిమచే నాయాపద తొలంగెను.

వ॥ అని ÷ ఘోషించు ఘోషజనులంగరుణించి జగదీశ్వరుండగు ననంతుండనంతశక్తియుతుండై గహనంబునిండిన దావదహనంబు పానంబుసేసిన విజయగానంబు దశదిశలంనిగిడె......... సమయంబున. భా. ద. పూ. 715

మఱియొకమారు కార్చిచ్చు బయలువెడలి గోగోపసంఘముల జొచ్చి తల్లడిల్లజేయ కృష్ణుడు దాని నివారించె.

ఉ॥ బంధుజనంబుచేత, నిటుప్రార్థితుడైహరి విశ్వరూపుతో
బంధువులార మీనయనపంకజముల్ ముకుళింపుడగ్ని నీ
సంధినడంతునే ననిన, జక్కనవారలు నట్లుచేయుడున్
బంధురదావపావకముబట్టి ముఖంబున ద్రావెలీలతో॥

## గోపికా వస్త్రాపహారణము.

ఈవిషయమును గూర్చి "మతధ్వజ"మున పూర్ణముగ వర్ణింపబడెను. అందు జూచుకొనుట మంచిది.

## ఋషిపత్నులకు పరమపదమిచ్చుట.

ఒకపుడు కృష్ణుండు గోవత్స గోపబాలకులతో నరణ్యమున సంచరించుచుండ వారికి క్షుద్బాధకలిగెను. అచటికి సమీపమున కొందరు మహాఋషులు యాగమొనర్చుచుండిరి. కృష్ణు డాబాలుర నాఋషివాటికకుబంపి కొంతయన్నము తోడ్కొని రమ్మనెను. ఆఋషిపత్నులు శ్రీకృష్ణార్పణముగ నన్నమొసంగుట మోక్షహేతువని యెంచిరి.

క॥ బిడ్డలుమగలును భ్రాతలు । నడ్డముచనివలదనంగ నటుదలడనిమా
ఱొడ్డుచు జగదీశ్వరునకు ।జడ్డననన్నంబుగొనుచు జనిరాసుదతుల్॥భా.ద.పూ.895

ఇటుల నన్నముదెచ్చియిచ్చి కృష్ణ పదసేవకై నిలచెదమనిరి. కృష్ణు డంగీకరింపకున్న.

మ॥ తగునే మాధవ యిట్టివాడిపలుకుల్ ధర్మంబులే మాయెడన్
మగలున్ బిడ్డలు సోదరుల్ జనకులున్ మమ్మున్ నివారింప మ
చ్చిగ నీయంఘ్రులసేరినారమటు బో జేకుందురే వారలా
పగి దే మొల్లను కింకరీజనులు గాభావించి రక్షింపవే॥

వ. అని న జగదీశ్వరుండు. 668

సీ|| నా సమీపమునను న్నారంచు నలుగురు బంధులు భ్రాతలు పతులుసుతులు
మిమ్ము దేవతలైన మెత్తురంగనలార, నాదేహసంగంబు నరులకెల్ల
సౌఖ్యానురాగ సంజనకంబుగాదు ముక్తిప్రదాయకము నాకీర్తనమున
దర్శనాకర్ణనధ్యానంబునను గర్మబంధ దేహంబున బాసిమీరు

తే|| మానసంబులు నాయందు మరగజేసి నన్నుజేరెదరటమీద నమ్మ్రదనుచు
బలికి వారలుదెచ్చిన భక్షణాదులా ప్తవర్గంబుతో హరియారగించె। 869

కృష్ణునకు వ్యభిచారోద్దేశములేదుగాన స్త్రీ, పురుష దేహసంగంబు, నరులకు సౌఖ్యానురాగసంజనకంబు గాదనియు, భగవన్నామ కీర్తన దర్శనాకర్ణనధ్యానంబున కర్మబంధవిమోచనం బగుననియు బోధించి, వారల నోడంబఱచి యన్నము భుజించి స్వర్లోకపదమియ్యదలచి విమానంబులరావించి వైకుంఠమునకు బంపె.

వ. (కృష్ణదూతలు) రయంబున రథంబుదిగివచ్చి కృష్ణునకు నమస్కరించి విప్ర పత్నులంజూచి రథంబారోహింపుడనిన, వారు శీఘ్రంబున గోవిందు చరణారవిందం బుల కభివందనంబులుగావించి, మానుష దేహంబులు విడిచి దివ్యగోపవేషధారులై రథా రోహణంబుచేసి గోలోకంబునకుం జనిరంత.........నిట్లనిరి. (బ|| కై|| కృ. ఖం.

## కృష్ణుడు నూతనస్త్రీలను పుట్టించుట.

వ|| రయంబున............జనిరంత, ముకుందుండు తనమాయవలన దాదృశ రూపయౌవనాలంకారాధిక్యంబులుగల విప్రపత్నుల నిర్మించి నిలయంబులకుఁ బనిచిన

కృష్ణునిచే సృజింపబడిన నూతన ఋషిపత్నులను తమభార్యలేయని తలచుకొని సంతసించిరి.

క|| జగదీశున కన్నంబిడి । యగణితముగ, మీరు ధన్యలై తిరిగాత్రి
న్మగువలకుగల వివేకము । మగవారికి మాకులేదు మాటలికేలా. (బ. కై. కృ.ఖ.

## కృష్ణుడు ప్రకృతి శాస్త్రవేత్త యనుట.

వర్షములు చక్కగ గురియుటకు నందు డింద్రియాగము చేయదలంచె, కృష్ణుడది యొఱిగి ఇంద్రునకు సర్వాధికారము లేదనియు, నతనికింగల యధికారము భగవంతుడగు తనచే నొసంగబడెననియు, లోకమునకు, దెలియజేయనెంచి ప్రకృతిశాస్త్ర పరిజ్ఞానముచే వర్షోత్పత్తికింగల కారణముల నీక్రింది విధమునముడివె. సూర్యరశ్మిచే సముద్రజలము పీల్చబడి మేఘరూపమై వర్షించుననిసిద్ధాంతమొనర్చెను.

చ॥ వలువుగ శంకుమాలివలన, స్సలిలంబుదయించు దానిచే
నిలగల సర్వసస్యములు వృక్షములుందగ వృద్ధినొందు సాం
కులరగ నోషధుల్ఫలములందు జనించును, వాటినన్నిటి
న్వలనుగ మెక్కి విప్రులు ధ్రువంబుగ ధాత్రి మనన్ప్రవేశ్వరా॥

క॥ తరణి నిజమయూఖంబున । గురుతుగ గ్రీష్మమున జలము గ్రోలి మరల బం
ధుర వర్షాకాలంబున । ధరపై వర్షించునింత తథ్యంబరయన్.

చ॥ వెలయగ, నే విభుండు గనువిచ్చిన మాపిన యంతలో జగం
బులు జనియించు, జేనడగు, బొల్పగ భ్రూయుగ భంగలీలచే 2 అ.
జలజభవుల్సురేశ్వరు, లసంఖ్యులు పుట్టుదు, రట్టియీశ్వరుం
జెలగిభజింపు, జేమియును జేయగజాలదు శక్రుడి త్రతిన్॥ కృ. ఖ.

## కృష్ణుడు గోవర్ధన పర్వతమెత్తుట.

నందుం డింద్రయాగము జేయదలపెట్టి యింద్ర ప్రభావంబు శూన్యంబని నిశ్చయిం చుటచే, నింద్రుడు స్వసామర్థ్యము జూపదలచి, నందుని మందపైనను, నందుని బంధు వులపైనను శిలావర్షము గురిపించె. కృష్ణుడా బాధను నివారింపదలచి.

శా॥ బాలుండీతడు కొండ దొడ్డది మహాభారంబు సైరింపగా
జాలండోయని మీనిక్రింద నిలువన్ శంకింపగా బోలదీ
శైలాంభోనిధి జంతుసంయుత ధరాచక్రంబుపై బడ్డనా
కేలల్లాడదు బంధులార నిలుడీక్రిందం బ్రమోదంబునన్ ॥ భాగవతం.

వ॥ ఇట్లు హరి, యేడహోరాత్రములు, గిరిధరించిన గిరిభేది వినిగి, వేసరి కృష్ణ చరితంబులు విని వెరగుపడి, విఫలమనోరథుండై మేఘంబుల మరలించుకొని చనియె

## అప్పుడు కృష్ణుని వయస్సు.

క॥ ఏడేండ్ల బాలుడెక్కడ క్రీడంగరి తమ్మియెత్తు క్రియనందఅము
బూనగిరి యెత్తుటెక్కడ । వేడుకనొకచేత నేడు వెఱగాగాదే ॥

## నందాదులకు విశ్వరూప ప్రదర్శనము.

నందుడొకనా, డేకాదశియం, దుపవసించి, ద్వాదశీ స్నానార్థము, యము నానదిం జేరి, వరుణభటునిచే, బట్టువడి, వరుణనగరమునకుం, గొనిపోబడియె. శ్రీకృష్ణ

డువిని, వరుణనగరమునకు జని, పూజితుడై, తమతండ్రిని విడిపించుకొనివచ్చె. బంధువు లెల్లరు; నీతడు భగవంతుడని స్తుతించిరి. తనను బ్రహ్మముగ భావించిన వారలందరికి బ్రహ్మాత్మ సంస్థితి కలుగజేయదలచి.

మ|| అని చింతించి, దయాళుడైన హరి మాయాదూరమై జ్యోతియై
యనిరూప్యంబయి సత్యమై యొకటియై యానందమై బ్రహ్మమై
యనఘాత్ముల్ గుణనాశమందు గను నిత్యాత్మీయ లోకంబు గ్ర
క్కునజూపెం గరుణార్ద్రచిత్తుడగుచున్ గోపాలక శ్రేణికిన్|| భా.ద.పూ.960

వ|| ఇట్లు హరి, మున్నక్రూరుండు పొందిన లోకమంతయు, జూపి, బ్రహ్మ లోకంబు నూపినంజూచి, నందాదులు పరమానందంబుబొంది, వెఱగుపడి, హంస స్వరూపకుండైన కృష్ణునింబొడగని, పొగిడి, పూజించిరంత|| ..................961

## కృష్ణుడు గోపికలకు వ్యభిచారమునింద్యమని బోధించుట.

శరత్కాలమున నగ్గరాత్రియం దొకనాడు కృష్ణుడు మురళీగానము సేయుచుండ, గోపికలు స్వగృహంబులు విడిచి కృష్ణునికడకేగిరి. మదనాగ్ని తప్తులగు, గోపికలు, కృష్ణుతో క్రీడించి, ముక్తింజెందిరని శుకుండువలుక పరీక్షిత్తు సంశయించి యిట్లనియె.

క|| జారుడని కాని కృష్ణుడు । భూరి పరబ్రహ్మమనియు బుద్ధిదలంపక
నేరరు గుణమయదేహము । లేరీతిన్ విడిచి, రింతు లెఱిగింపుశుకా|| భా.ద.పూ.969

వ|| అనినశుకుండిట్లనియె|| 970

మ|| మును నే జెప్పితి జక్రికింబగతుడై మూఢుండు చైద్యుండు పెం
పున గైవల్య పదంబునొందె బ్రియులై పొందంగరాకున్న దే
యనఘుండవ్యయుడప్రమేయుడగుణుండైనట్టి గోవిందుమూ
ర్తి నరశ్రేణికి ముక్తిదాయినిసుమీ తెల్లంబు భూవల్లభా || 971

కృష్ణుడు కేవలము జారపురుషుడని నిశ్చయించిన గోపికలకు, మోక్షము కలుగుట యసంభవమని సంశయింపబనిలేదు. ఏమన శ్రీ కృష్ణుడు కామవిధ్వంసియనియు సనకాది ఋషివంద్యుడనియు గోపికలు తలచిరి,

మ|| ఘనలక్ష్మీమయుతమైవినన్ శుభదమై కామాది విధ్వంసియై
సనకాదిస్తుతమై నిరంతర తపస్సంతప్త పున్నాగ జీ
వనమైయొప్పెడు నీకథామృతము ద్రావంగల్గునే భూరి దా
ననిరూఢత్వములేనివారలకు మానారీమనోహారకా|| .1044

యని వర్ణించియుండిరి.

969 వ పద్యములో శ్రీకృష్ణుని బ్రహ్మమని తలంచనటులను; ఈ పైపద్యములో బ్రహ్మమని తలచినట్లును కలదు. దీనిభావమేమన, నతడు పరబ్రహ్మమేయని వారు నిశ్చయించుకొనినను సాధారణలోకము బ్రహ్మానుసంధానముచేయు విధమువలెగాక అంగాంగసంయోగవిధాన మవలంబించి వర్తించిరని తెలియుచున్నది. కృష్ణుడు పరబ్రహ్మమేయని గోపికలు తలంచినపద్యము లెన్నియోకలవు. ఈగోపికలు కృష్ణుని పతిగాకేయ దలచుకొని ప్రార్థించినపుడు ఆతడెట్టి నీతినిబోధించెనో తెలిసికొనినచో ఆతని పారిశుద్ధ్యము వెల్లడింపబడకమానదు.

శా॥ మీ రేతెంచినజాడగానక వగన్ మీతల్లులుం దండ్రులున్
మీరామల్ మఱదుల్, తనూజులు గురుల్ మీసోదరుల్ బంధువుల్
మేలల్ మీజేరి లేరు, పోయిరనుచున్ మీఘోషభూభాగమం
దేరీతింబరికించిరో తగవులే యీ సాహసోద్యోగముల్ 976

చ॥ ఇలువడినున్న నేసి హృదయేశుల సిగ్గులుపుచ్చి తల్లిదం
డ్రుల రుచిమాన్చి బంధులకు, రోతయొనర్చుచు జారవాంఛలన్
వలనతి సత్కులాంగనలువత్తురె లోకులుసూచి మెత్తురే॥ 977

క॥ నడవడిగొఱగాకున్నను । బడుగైన గురూపియైన బామరుడైనన్
జడుడైన రోగియైనను । విడుచుట మరియాదగాదు విభునంగనకున్॥ 979

చ॥ వనితలునన్నుగోరి యిటువచ్చితిరింత గొఱంతలేదు మే
లౌనరె సమస్తజంతువులునోలి బ్రియంబులుగావె నాకునై
నను నిలుపంగబోలదు సనాతనధర్మము లాడువారికిం
బెనిమిటులన్ భజించుటలు పెద్దలు సెప్పుచునుందురెల్లెడన్॥ 981

క॥ ధ్యానాకర్ణనదర్శన । గానంబుల నాతలంపుగలిగినజాలుం
బూనెదరు కృతార్థత్వము । మానవతుల్, చనుడు, మరలి మందిరములకున్॥ 982

ఈ బోధను వినినగోపికలు క్రింద చెప్పబడిన పద్యముచే తమపతులు పుత్రులు మొదలగు వారందరు కృష్ణుడవైన (భగవంతుడవైన) నీ స్వరూపములేయనియు, అట్టిపతి పుత్రులకు మూలమైన నీసేవమాకు లభించినపుడు అనగా నిన్నేమేము సేవించినపుడు మేము పతిపుత్రుల సేవించినవారమగుటకు లోపములేదనియు చక్కగ వేదాంతతత్వమును విశాలహృదయముతో తాదాత్మ్యదీక్షానులై వెల్లడించిరి, కృష్ణు డాన్యాయము

నను సమ్మతింపవలసివచ్చె. ఆయుభయుల కాన్యాయము ఘటించినను ఈలోకమర్యాద చొప్పున మిధునకర్మము జరిగియుండలేదు. ఇంద్రియస్ఖలనమైనపుడే మిధునకర్మముపూర్తి యగును. కృష్ణుడటుల స్ఖలితుడుకాలేదు.

ఇందుకు ప్రమాణము.

వ॥ ఇట్లు శరత్కాలంబున వెన్నుండింద్రియస్ఖలనంబు సేయక గోపికలతోడ రమించెనని చెప్పిన మునివరులకు భూవరుండిట్లనియె. భా. ద. పూ. 1101

ఈకథ శరదృతువునందు జరిగినది. తత్పూర్వవత్సర హేమంతఋతువునం దీగోపికలే; శ్రీకృష్ణుడు తమకు భర్తగానుండవలెనని యమునానదీతీరమున గౌరీవ్రత మాచరించిరి. ఆపద్యములు "మతధ్వజము" లో కనదగును. ఆగౌరి, శ్రీకృష్ణుడు మీకు పతిగానుండగలడని వరమొసంగె. కృష్ణుడు పతియైయుండెగదా? ఆగోపికలు నీసేవచేసెదమని చెప్పినపుడు,పరపురుషుడనైన నన్ను పొందుట న్యాయమాయని కృష్ణుడేల నుడివెనని సంశయింపబనిలేదు. లోకమునకంతయు పరమాత్మయే పతియగును. ఇట్లుండ స్త్రీలకు పురుషులు పతులుగానుండుట మనము చూచుచున్నాము. స్త్రీలకు పురుషులే, నిజమైనపతులైనచో జగత్పతియగు దేవుడు వారలకు పతిగానుండనోపడు. జగత్పతి యనెడి శబ్దమునకే భంగమువాటిల్లును. స్త్రీలయొక్క భర్తలు జగత్పతియొక్క ప్రతి నిధులుగ నేర్పడి తాత్కాలిక పతు లగుచుండిరనుటయే వాస్తవమైయున్నది. ఒకనికి బదులుగ వచ్చినవాడు ప్రతినిధియనబడును. ఆప్రతినిధితో కాలము గడపుకొనుచుండిన వారు స్వయముగ జగత్పతిని దర్శించినపుడు ప్రతినిధినివిడిచి యామూలనిధిసే సేవించిన దోషములేదు. ఈధర్మమును గోపికలు గ్రహించినదియు లేనిదియు తెలుసుకొనుటకై శ్రీ కృష్ణుడుతాను పరపురుషుడనని చెప్పెనే, కాని వాస్తవమున, నతడు పరపురుషుడుకాడు.

ఆ॥ గోపజనములందు గోపికలందును । సకలజంతులందు సంచరించు
నామహాత్మునకు బరాంగనలెవ్వరు । సర్వమయుడు లీలసలిపెగాక॥ 1108

భర్తలువలదన్నను బయలువెడలి యర్ధరాత్రమున కృష్ణునికడకేగి రాసక్రీడ జలక్రీడలదృప్తిజెంది మరునాడుదయము స్వగృహములకు వెళ్లినపుడు పతులాసతుల గోపింప రైరి. కృష్ణుడొకవిటకాడేయైనచో తమభార్యలొనర్చినది వ్యభిచారమేయైనచో మానాభిమానరహితుడొక్కడను మతింపవచ్చునేమో! పతులందరందుకు సమ్మతించుటజూడ కృష్ణ మాహాత్మ్యమే వెల్లడియగు. అతనికి నీచభావమంటకట్టుటకు నీచుడుతలపడవచ్చును,

వ, అనిచెప్పిశుకుండిట్లనియె బ్రాహ్మ్యము హూర్తంబునం గృష్ణువీడ్కొని గోపిక

లిచ్చుటకయు నిండ్లకడకేగినం గృష్ణమాయామోహితులై గోపకులు వారలంగోపింప నేరరైరి భా. ద, పూ. 1109

## కృష్ణుడుబహురూపియై క్రీడించుట.

కృష్ణుండు రాసమండల మేర్పరచుకొని వేలకొలది గోపికల భుజములపై భుజములజేర్చి నృత్యమాడినపుడు తానుబహురూపముల ధరించె,

వ॥ ఇట్లుబహుగతులందిరుగ నేర్పరియగు హరి.........మురళీవివరంబుల సారించి పూరించుచు సరిలేనిభంగిం ద్రిభంగియై కమలకర్ణికాకారంబున నడుమనిలిచి మఱియు గోపసుందరు లెందఱందరకు నందఱయి సుందరుల కవలయెడలం దానును దనకవలియెడల సుందరులును దేజరిల్ల నృత్తవిద్యామహార్ణవ వేలావలయవలయితంబై విస్మితాఖండలంబైనరాసమండలంబుగల్పించి............యుండెనందు.

## కృష్ణుడుసర్పబాధను తొలగించుట.

వ॥ అంనొక్కనాడు............దైవయోగంబున నాకొని యొక్క మహోరగంబు నిదురవోయిన నందునింగఱచి మ్రింగవగ్గలింపనతండు కృష్ణ కృష్ణేతి వచనంబుల దన్నువిడిపింపుమని మొఱయిడినవిని. 1111.

వ. అయ్యవసరంబున కృష్ణుండు దర్పించి పాదతాడనంబుసేసి ద్రొక్కిన సర్పంబుసర్పరూపంబువిడిచి విద్యాధరేంద్ర రూపంబుదాల్చి.........యిట్లనియె 1113.

వ॥ అనిన......దేవాయేను సుదర్శనుండను విద్యాధరుండ విమానారూఢుండనై రూపసంపద్గర్వంబులజిక్కిదిక్కులంజరించుచు నొక్కయెడనాంగిరసులైన ఋషులం గురూపులైన వారలగని, నగిన, వారును, నీవురూపదర్పంబున మమ్మునగితివిగావున మహాసర్పంబవై యుండుమని శపించి......నిట్లనిరి 1115.

వ॥ అనివిన్నవించి......సుదర్శనుండు దివంబునకుంజనియె సర్పంబువలన నందువిముక్తుండయ్యె.........జనిరంత॥ 1118.

## శంఖచూడుని సంహరించుట.

కుబేరభటుండగు శంఖచూడుడు కొందఱగోపికలనెత్తుకొనిపోయె. కృష్ణుడతని సంహరించి వానిశిరోరత్నముందెచ్చి మెప్పుకై బలభద్రునకిచ్చె.

## వృషభాసురవధ.

వృషభరూపముధరించిన యొక్క రక్కసుడు ఆవులమందలో జొచ్చి గోపబాలురను గోవత్సములను బాధుచుచుండ కృష్ణుడాయెద్దును బ్రద్దలగునట్లుజీల్చె.

ఆ. అంత గోపసింహుఁ డసురకొమ్ములుపట్టి ధరణిఁద్రొబ్బిత్రొక్కి దైత్యభటుల
గొమ్మలీగనురలకొమ్మ వర్ధిలవాని కొమ్మువెఱికి మొత్తికూల్చెనధిప॥ 1144.

## కేశి వ్యోమాసురుల సంహరించుట.

నారదుడు కంససంహరణకాలము సమీపించెననియెంచి నినుజంపువాడు బృందావనమున బెరుగుచుండెనని హెచ్చరించివెళ్లె. వినాశకాలే విపరీతబుద్ధిః యనునట్లు సాధువుల బాధించుటగాని కారాగృహమునునుంచుటకాని సంకెలలు తగిలించుటకాని వారి జీవనముభంగముచేయుటకాని నిందించుటకాని దుష్టనాశనమునకు కారణమగుచుండు. బృందావనమున బెరుగుచుండిన శిశువునకు దేవుని పుత్రుడేయని నారదునివలనవిని కంసువడా వసుదేవునిసంకెలలతో బంధించి కేశియనురాక్షసిని కృష్ణవధార్థముబంపె. కృష్ణుడున్ను గోపబాలకులు దొంగలాటలాడుచుండ నారాక్షసుడొక గోపబాలరూపము ధరించి కొందఱగోపాలుర నపహరించి కొండగుహలో బెట్టి పెద్దబండను మూతవైచె. కృష్ణుడదియెఱిగి యతనివధించి మూతబండను తొలగించి బాలురవిడిపించుకొనివచ్చె.

## కృష్ణుడక్రూరనకు విశ్వరూపముజూపుట.

కంసుడు ధనుర్యాగమిషచే రామకృష్ణులరావించి యకస్మాత్తుగ జంపవచ్చునని యెంచి యాగమారంభించి మంత్రియగు నక్రూరుని కృష్ణుకడకుబనిచె. అతడు రామకృష్ణులదోడ్కొనివచ్చుచు యమునానదికి సమీపమున రథమునిలిపి తానానదింజేరి స్నానమాడి.

ఉ॥ స్నానము సేసి చేసి, నది జల్లనినీటను రామకృష్ణులఁ
మానుగజూచివీరు రథమధ్యమునఁ వసియించియున్న వా
రీనది నీరిలోపలికి, నెప్పుడువచ్చిరటంచు లేచి మే
ధానిధిచూచె వారిని రథస్థుల భక్తమనోరథస్థులఁ॥ భాగ. దశ. పూర్వ, 1220

శా॥ కంటిఁ మున్ను రథంబుపై జలములో గంటిఁ తుదిం గ్రమ్మఱం
గంటిం దొంటిరథంబుమీద నిదె కల్యాణచారిత్రులే
వెంటందోచిరి రెండు దిక్కుల మనోవిభ్రాంతి యోనీటిలో
నంటాశ్చర్యము చూతునంచు మఱియున్నాహించి మగ్నాంగుఁడై॥ భా. ద. 228

ఈ విధమున కృష్ణుని దర్శించి తిరిగి జలంబులలో మునిగి.

సీ॥ ఆభోగి.........

ఆ॥ వె॥ జలజగర్భ రుద్ర సనక సనందన । సద్ద్విజామర ప్రశస్యమాన
చరితుడైనవాని సౌందర్యఖనియైన । వానినొక్క పురుషవర్యుగాంచె ॥ 1231

విశ్వరూపమున నొప్పుచుండెడి కృష్ణభగవానుల దర్శించి పులకాంకితుండై గద్గద కంఠుండై దిగ్గనం గరంబులు ముకుళించి పరబ్రహ్మాకారముగ స్తుతియించె, ఆ స్తుతి దండకరూపమున దశమస్కంధం 1233 వ సంఖ్యలో సదృశముగ వర్ణింపబడి యున్నది ఈ గ్రంథమాల యొక్క ప్రథమ పుస్తకమగు "భగవద్ధ్యానము"న నా దండకమును జూచుకొనవచ్చును. అక్రూరు, డాదివ్యసుందర విగ్రహమును స్తుతించి తదేకనిష్ఠచే నామహాత్స్వరూపమును దర్శింపజాలక కించిద్రూపము వహింపుమని ప్రార్థించె అంత,

వ॥ అని మఱియును వినుతింప నక్రూరునకు యమునా జలంబులలోన నతని పొందలి మేనుమాపి చాలించి, నటునికై వడిం, దిరోహితుడైన, నక్రూరుండు, నీరువెడలి, వెఱంగు పడుచువచ్చి రథారోహణంబుసేసిన హరి యిట్లనియె. భా. ద. పూ, 1235,

## కృష్ణుడు మథురానగర ప్రవేశము చేయుట.

అక్రూరుండంతట రామకృష్ణులను కంసరాజధానిలో బ్రవేశింపజేసె.

## రజకుని వధించి ముక్తి నొసంగుట.

కొన్ని శాపములచే కృష్ణునివలన మృతినొంది పాపవిముక్తులై స్వస్వరూపముల నొందవలసిన వారందఱు, కంసునకు సేవకులై సేనలై జన్మించి యుండిరి. కంస వస్త్రములను మాత్రమే శుభ్రము చేయునట్టి యొకచాకలి, కృష్ణునివలన జచ్చి గోలోకముంజేరె,

వ. అని పలికిన రజకుని............వధించి వానిచేతి వస్త్రములు పుచ్చికొని బలభద్రుండును దానును దక్కిన సహచరులును ధరించిరి. రజకుండు గోవిందునిచే మృతుండై, దివ్యరథం బారోహించి జరామరణ వర్జితంబైన గోలోకమునకుం జని యందు హరి పార్షదుండయ్యె. నిట్లు రజకునకు మోక్షం బొసంగి॥ కృ.ఖ.5.అ.

## వాయకునకు సారూప్యము నైశ్వర్యము నిచ్చుట.

క॥ అంతట నొక వాయకుడాక్రంతతఁ । వసుదేవ సుతులగని బహువర్ణా
త్యంత మృదుపటాభరణము నెంతయు సంతసముతోడనిచ్చెఁ మెచ్చన్ 1262

శా॥ కారుణ్యంబున వానికైకొని యలంకారంబుగావించి శృం
గారోదంచిత దిగ్గజేంద్రకల భాకారంబులంబొల్చి రా
కూరుల్ మాధవుడంత వాయకుని శ్రీశూవఁ మహాప్రీతుడై
సారూప్యంబును లక్ష్మియుం నొసగె నైశ్వర్యాధి సంధాయియై॥ 1263

## సుదామునకు బలసంపద నొసంగుట.

మాలాకారుడగు సుదాముడు తన గృహమునకేతెంచిన రామకృష్ణులకు, సుగంధ గంబూలంబులు, కుసుమ ధామంబు, లర్పింప నాస్వల్ప బహుమానముల గైకొని.

వ. అని వేడికొనిన నిచ్చి మఱియు మాధవుండమ్మాలికునకు బలాయుః కాంతి కీర్తి సంపదలొసంగి వాని గృహంబు వెడలి రాజవీథిం జని చని. 1270

## వికారరూపియగు కుబ్జను రూపవతిగ జేయుట.

ఈకుబ్జయనెడి స్త్రీ పూర్వజన్మమున శూర్పణఖగానుండె. అప్పుడు రాముని వరింపయత్నించి లక్ష్మణునిచే, విరూపిగ జేయబడి తత్సంకల్ప సాఫల్యార్థము విధింగూర్చి తపమొనర్చి తపఃఫలంబుగ నిప్పుడు కుబ్జయైపుట్టి, కంసునకు సేవకురాలై, కాలముగడుపుచుండె. తపఃఫలప్రదాతయైన శ్రీకృష్ణుడు ఆకురూపిని, సురూపిగ జేసె.

సీ॥ ఇవ్విధంబునకుబ్జ యిచ్చినలేపనంబు, లన్నియు, దాను, దేహమునలది
కొని ప్రసన్నతనొంది కుబ్జ, మువ్వంకల, యొడలు, చక్కగనొత్తి యనుపదలచి
తత్పదంబులమీద, దనపదంబులుద్రొక్కి హస్తాంగుళద్వయ మబలగౌద
క్రిందవిప్పననిడి కృష్ణుండు మీదికినెత్తిన వక్రతలెల్లమాని
ఆ॥ వె॥ చక్కనైన చిత్తజన్మబాణముక్రియ । గొమరుమిగిలి పిరుదు కుచయుగంబు
సొంపుసేయదరుణి సుందరమూర్తియై । కమలనయనుజూచి కాంక్షతోడ॥ 1277

## ఒక మదగజంబును చంపుట

కంసుడు సభామంటపద్వారంబున కువలయాపీడంబను నొక గజంబును, చాణూరముష్టికులనెడి యుద్ధఅమల్లుర నునిచి కృష్ణుడు లోనికిప్రవేశించునపు డతని వధించుటకై నియమించె. కృష్ణుడు సభామంటపమునకు వచ్చుటకుపూర్వము యాగస్థలమున నుంచబడిన ధనస్సును భగ్నముగావించి పిమ్మట కంససభామంటపద్వారముకడకేగె. అది విఱిగినపుడు కలిగిన పెటపెటమనెడి ధ్వనులు కంసుని వీనులసోకి భయపీడితునిగ జేయ నిశ్చేష్టితుండైయుండె. అప్పుడే అతనిశరీరము క్రుంగె. శరీరమున చచ్చుదనము హెచ్చె. జీవచ్ఛవాకారుడై చావుసమీపించెనేమోయని భయమొందుచు గుందుచుండె. ఇంతలో కృష్ణుండు మంటపద్వారముకడ తన్నడ్డగించిన మదగజమును సంహరించె.

శా॥ కాలంద్రొక్కి సలీలుడై నగవుతో గంభీరవేంద్రాకృతిం
గేలన్ భీమరదంతముల్ వెఱికి సంక్షీణంబుగా మొత్తి గో
పాలగ్రామణి వీరమాలిమణియై ప్రాణంబులంబాపెనా
శైలేంద్రాభము బ్రాణలోభము నుదంచత్సారగంధేభమున్॥ భా. ద. పూ. 1319

మఱియు చాణూరముష్టికు లడ్డగించినపుడు వారల నేలంగూల్చె.

## కంసవధ.

మంటపద్వారమున నిలిచియున్న చాణూరముష్టికులు నష్టపడిరని కంసుడెరింగి మంత్రులంజూచి యిట్లనియె.

ఉ॥ పల్లవబాలురన్ నగరివాకిలికిన్ వెడలంగద్రొబ్బుడీ
గొల్లలముట్టికోల్ గొనుడు, క్రూరుని నందుని గట్టు డుర్వికిన్
దెల్లముగాగ నేడు వసుదేవునిచంపుడు తండ్రిగాడు వీ
డెల్లవిధంబులం బరులకిష్టుడు కావకుడుగ్రసేనునిన్॥ భా. ద. పూ. 1370

ఈకంసుడు మొదటినుండి భయమార్గమవలంబించుటచేతనే; నేడెదురుపడి వచ్చుచున్న కృష్ణునెదుర్కొనజాలక, ఆబాలుర వెడలగొట్టుడనియు, నందునిగట్టుడనియు, వసుదేవుని చంపుడనియు, తనతండ్రియగు నుగ్రసేనుని మన్నింపకుడనియు సొరకాయల నఱకుచుండెను. ఇంతలో కృష్ణుండు గజముమీదికిలంఘించు సింహముపగిది కంసప్రాణహింసార్థియై కంసకేశపాశంబులంబట్టి గ్రిందికిం దిగలాగి నిమిషమాత్రమున గుండెలు పగులునటుల ఖండించి యతని దనలోజేర్చుకొనియె.

క॥ రోషప్రమోదనిద్రా భాషాశనపానగతుల బాయకచక్రిన్
దోషగతిజూచియైన ని । శేషరుచిం గంసుడతనిజెందె నరేంద్రా॥ భా.ద.పూ.1367

ప్ర. కంసవధాసమయమున కృష్ణునకు వయస్సెంతయో ప్రమాణముకలదా?

ఉ. నందనవనమునుండి కృష్ణుడు మధురానగరము ప్రవేశించినవెంటనే, కంసవధ జరిగినది. నందవ్రజమున నతడెంతకాలము నివసించియుండెనో తెలిసినపుడు కంసవధా కాలనిర్ణయమేర్పడును.

క॥ హరి, యేకాదశసంవ । త్సరములు నందవ్రజమున దనుహరియని యె
వ్వరు నెఱుగకుండ నాహాల । ధరుతో క్రీడించుచుండె దద్దయుప్రీతిన్॥
భాగ. తృతీయస్కంధం. 105

పదునొకండవ వత్సరము చివరభాగముననో లేక పండ్రెండవ వత్సరారంభముననో కంసుడు వధింపబడియుండు. కంసవధానంతరము వసుదేవుడు కాలముమించి పోవుచున్నదని యెఱిగి కృష్ణున కుపనయనముగావించె. బ్రాహ్మణులకు జన్మాది యేడవ వత్సరమునను క్షత్రియునకు పదియవ వత్సరమునను, వైశ్యునకు పదునొకండవ వత్సరమునను, నుపనయనము గావించు నటుల ధర్మసూత్రములుండుటచే వైశ్యుడగు నందునింట బెరిగిన కారణమున నతనికి పదుకొండవయేట నుపనయనమై యుండవచ్చు. ఉపనయ

నమునకుపూర్వమే కంసవధయని తెలిసినపుడు కృష్ణవయస్సు పదునొకండు (లేక పం(డెండు) వత్సరముల ప్రాయమని సిద్ధాంతము.

## కృష్ణుడు విద్యాభ్యాసము చేయుట.

సర్వవిద్యాపీఠమగు కాశీప్రాంతమగు నవంతీపురమున నివసించు సాందీప ముని వలన.

క॥ అఱువదినాలుగువిద్యలు । నఱువదినాలుగుదినంబు లంతనవారల్
నెఱవాదులైనకతమున । నెఱినొక్కొక నాటివినికి నేర్చిరిలేశా॥ భా.ద.పూ. 1416

రెండుమాసములలో సర్వవిద్యా పారంగతుండయ్యె. సర్వవిద్యాపరిపూర్ణుడగు భగవంతుడు విద్యార్జనమునకై గురువులజేరుట లోకనిమిత్తమగును.

## మృతుడగు గురుపుత్రుని బ్రతికించుట.

విద్య పూర్తియైనపిమ్మట లోకమర్యాద ననుసరించి దక్షిణనొసంగుమని గురువు కోరెను. ఏనాడో మృతినొందిన తనపుత్రుని దెచ్చియిచ్చిన జాలునని గురుండుపలికె. సృష్టిస్థితి సంహారకారకుండగు భగవంతుడు శ్రీకృష్ణుడేయని నిశ్చయించి మృతుడైన పుత్రుని సజీవునిగజేయ నతనికి సామర్థ్యముకలద నెడి భావమున నిటులగోరెను. గుర్వాజ్ఞాప్రకారము కృష్ణుండు యమపురంబునకు బయనమయ్యె.

వ॥ ఇట్లు జముసడిగి తెచ్చి, రామకృష్ణులు సాందీపునికిం బుత్రునిసమర్పించి నింకనేమిచేయవలయు, నానతిండనిన నతండిట్లనియె. 1427

క॥ కాలునివీటికిజని మృత । బాలకుదే నొరులవశమె భవదీయకృపకా
మేలుదొరకొనియె మాకు వి । శాలమగుంగాత మీయశము లోకములన్ ॥ 1429

ఇటుల గురుపుత్రుని బ్రతికించియిచ్చిన పిమ్మట కృష్ణుడు బృందావనంబున గోప గోపీజనంబుల విడిచివచ్చి యప్పటికి విశేషకాలమగుటచే వారలకు దనవృత్తాంతము దెలియజేయ నుద్ధవునింబంపె. బంధువులగు కురుపాండవుల యోగక్షేమమరయ నెంచి యక్రూరుని హాస్తినాపురమునకు బనిచె. విగతభర్తలగు కంసభార్యలు కృష్ణునిచే, తమకు గలిగిన వైధవ్యస్థితి వారితండ్రియగు జరాసంధునితో విన్నవించి శత్రువిచ్ఛేదము చేయుమని పురికొల్పిరి. కృష్ణుడు కంససంహారమొనరించినదిమొదలు దేవకీవసుదేవులతో గూడి మధురానగరముననే వసించుచుండె.

## కృష్ణుడు జరాసంధు నోడించుట.

క॥ జగతీశ యేమి సెప్పుదు । నగణితలయవార్ధి భయద మైమూగిన య
మ్మగధీశు బలము నెల్లను । దెగజూచిరి హలియు హరియు దీవ్రక్రీడన్॥ 1570

వ॥ ఇట్లుపట్టుకొని. 1574

ఉ॥ కుంతితులై పరుల్ బెగడఘోరబలుండు బలుండు వానిసో
ల్లుంఠములాడుచున్ దిగిచి లోకభయంకరమైనముష్టిచే
గంశగతాను జేసితమకంబున మొత్తగ భూభరక్షరో
త్కంఠుడు చక్రిమీఱ దెఱిగి కార్యముగల్గని మాన్పియిట్లనున్ 1575

శా॥ దుఃఖింపం బనిలేదుపొమ్ము బలసందోహంబులం దెమ్ము చే
తఃఖేదం బెడలంగరమ్ము రిపులం దండింపు కాదేని భూ
స్వాఃఖేలజ్జనమెల్ల మెచ్చ నృపనీ శౌర్యోన్నతుల్ సూపిమే
దఃఖండంబుల భూతముల్ దెన దనుత్యాగంబు సేయందగున్॥ 1576

వ॥ అని నగుచు విడిపించిన దపంబు సేసినైన వీరలజయించెదనని పలాయితులైన రాజులంగూడికొనుచు జరాసంధుడు దిరిగిచనియె. 1577

వ॥ ఇట్లు............మఱియు నెక్కువ మత్సరంబున నమ్మాగధుండు మహీమండలంబునంగల దుష్టమహీపతుల నెల్లంగూడకొని సప్తదశవారంబులు సప్తదశాక్షౌహిణీబలసమేతుండై మధురానగరంబుపై విడిసి మాధవభుజాప్రాకారరక్షితులగు యాదవులతోడ నాలంబు సేసి నిర్మూలితబలుండై పోయి క్రమ్మ అష్టాదశయుద్ధంబునకు వచ్చునెడ. 1579

ఈ పైపద్యములవల్ల జరాసంధుడు పదునేడుమారులు పరిభవింపబడెనని తెలియుచున్నది. రుక్మిణీకల్యాణమున జరాసంధుడు శిశుపాలుతో నీక్రింది విధమున దెల్పిన వచనమునుబట్టి చూచినను కృష్ణుడు జయమొందినట్లేర్పడును.

వ॥ వినుము...............తొల్లి నేను మధురాపురంబుమీద పదియేడుమారులు పరాక్రమంబున విడిసి చక్రిచేతం బరాజితబలచక్రుండనై కామపాలు చేతం బట్టువడి కృష్ణుండు కరుణ సేసి విడిపించిన వచ్చి క్రమ్మ అనిరువదిమూ డక్షౌహిణులంగూడికొని పదునెనిమిదవ మారు దాడి చేసి 1759.

అ. జరాసంధాదుని భయంబువలన కృష్ణుడు మధురలో వసింపజాలక భూభా

గమును విడిచి సముద్రమున జేరియచటనొక ద్వీపమున ద్వారకాపట్టణము నిర్మించుకొని దాగియుండలేదా?

ఆ. జరాసంధుడు పదునెనిమిదవమారు యుద్ధమునకు రాదలంచియుండె. ఈసమయమున కాలయవనుడు మూడుకోట్ల మ్లేచ్ఛవరులంగూడి మధురపైదండువెడలి ముట్టడించె. దేవుడుఫలమొసంగునట్టి బాధ్యతకలిగియున్నను కొన్నిఫలములు స్వయముగా నిచ్చుటయు మఱికొన్నిఫలముల నితరులచే నిప్పించుటయు కర్మభేదముఁబట్టి జేయవలసియుండు. కాలయవనుడు స్వయముగ కృష్ణునిచే మృతిజెందునట్టి కర్మముచేసి యుండలేదు. ముచికుందునిచే జంపబడునట్టి విధియతనికిగలదు. ఈకాలయవనుడు ముచికుందునివద్దకు గొనిపోబడవలసియుండె. కాలయవనునకు కృష్ణుడుభయపడినటుల సంచరించి పురము విడిచి ముచికుందునిజేరెడి లోపలయుద్ధసన్నద్ధుడైన జరాసంధుడు మధురను ముట్టడించి కృష్ణబంధువులను హింసింపవచ్చును. బంధుజనరక్షణార్థముద్వారకనునిర్మించి రహస్యముగను బంధువులనెల్ల నచట్టికిబంపె. భయపడినవాడైనచో జరాసంధునితోడను కాలయవనునితోడను యుద్ధముచేయక పరుగిడెడివాడు. అట్లుగాక సైన్యరహితుడై నిరాయుధుడై కాలయవనునకెదురుగబోవ నతడిట్లనెను

శా॥ ఎన్నేనయ్యేదినంబు లీనగరిపై నేతెంచి పోరాటకున్
మున్నెవ్వండునురాడు వీడొకడునిర్ముక్తాయుధుండేగుదెం
చె న్నెన్నార్వగనో ప్రియోక్తులకునో శ్రీగోరియో చూడుడం
చున్నాత్మీయజనంబుతోడ యవనేశుండిట్లుతర్కింపగన్

భా. ద. పూ. 1615

ఆహా! శ్రీకృష్ణు ధీరోదాత్తగుణంబేమని వర్ణింపదగు. చరిత్రములయందెన్ని యుద్ధముల వినియుండలేదు. వీరాగ్రేసరుల శౌర్యపద్ధతినిగమనింపలేదు. కాని సైన్యమనక శత్రువులనక ఫిరంగులనక గుఱ్ఱపుదళమనక మదగజేంద్రములనక రథంబులనక భయమొందక పాదచారియై యెదిరించుట యెందైనగలదా? కుఱ్ఱయైయెదిరించినచో బ్రతుకుకలదా!

సీ॥ చటుల..........

ఆ. వె. శార్ఙ్గిపేర్చిమించి యశ్వంబుగదలించి । కమలసంభవాది ఘనులకైన
బట్టరానిప్రౌఢ బట్టెదనని జగ। దవనుబట్టగదిసె యవనుడధిప॥ భా.ద.పూ.1619

కృష్ణుడు ముచికుందుని సమీపించదలచి యవనునకు జిక్కినటుల నటించుచు జిక్కక, ముచికుందుని గుహకు నడుగులిడుచుండె.

క॥ ఆడలోఁబడె నీడలోఁబడె । నడె యిదె పట్టెదనటంచు నాశావశుఁడై
యదుసింహుని పదపద్ధతి । వదలక గిరిగహ్వరంబు వాఁడుంజొచ్చెం॥

కృష్ణుడు క్రమముగ గుహను జొరబడుటచూచి యవనుఁడు లోనికింబోయె, ముచికుందుడు గుహయందు నిద్రించుచుండె. ఇతడే కృష్ణుండనియెంచి తన్ని తపోజ్వాలచే, యవనుడు భస్మమాయె. ఈ ముచికుందుడు, శ్రీకృష్ణునకు పరమభక్తుడగుటచే నతనికి, దర్శనంబిచ్చి పరమపదము లభించెడిమార్గ ముపదేశించి తపమొనర్చుటకు గంధమాదనంబు నకుం బనిచె.

అంతకృష్ణుండు మధురానగరమునకు దిగివచ్చుచు జరాసంధుడు తత్పురము ముట్టడించుట యెఱిగి భయపడి పరుగిడువానిపలె నటించె. జరాసంధుడు భీమునిచే జంపబడునట్టి కర్మము చేసియుండుటచే నతని స్వయముగ వధింపనెంచక, యోడినవాని పలె పరుగిడి ప్రవర్షణగిరియనెడు నొక కొండపైకెక్కెను. జరాసంధుడు మొదట యుద్ధమునకువచ్చినపుడు బలరాము డతనిజంప సిద్ధమైయుండ జంపవలదని నివారించుటకు కారణము భీమునిచే చంపబడవలసిన విధియుండుటచేతనే యని యెఱుంగునది. జరాసంధు డాకొండనెక్కుటకు వీలులేనట్టి శాపముండుటచే కృష్ణమరణ మభిలషించి కొండను తగులబెట్టె. సర్వభక్షకుండగు కృష్ణుండా యగ్నిజ్వాలలచే దహింపబడక వెలికుఱికి క్రమముగ ద్వారకనుచేరె.

అ. కృష్ణుడు మధురానగరమున జన్మించి బృహద్వనమునకు గొనిపోబడెననియు, మూడు లేక నాల్గవవత్సరమున బృందావనముజేరెననియు పదునొకండు పన్రెండేవ వత్సరమున తిరిగి మధురానగరమున బ్రవేశించెననియు, నచ్చటకంసునిజంపి కాలయవన జరాసంధుల మదమడంచి, సముద్రమున ద్వారకాపురని, నిర్మించి యందు నివాసమేర్పరచుకొనెననియు వరుసగా వినబడితి. పిమ్మటి వృత్తాంత మేమి?

## రుక్మిణీ వివాహము.

ఆ. విదర్భదేశాధిపతియైన భీష్మకుండను రాజుయొక్క గర్భమున, లక్ష్మ్యంశచే జనించిన రుక్మిణీదేవిని వివాహమాడె. శివునిచే దహింపబడిన మన్మథుడు ఆమెయందు ప్రద్యుమ్నుడైపుట్టె. ఇతడు రుక్మిణీసోదరుడగు రుక్మియొక్క పుత్రికయగు రుక్మవతిని పెండ్లాడె. ఆమెయందు అనిరుద్ధు డుదయించె.

## జాంబవతీ వివాహము.

సత్రాజిత్తనువానిచే సూర్యప్రసాదమున సంపాదించబడిన శమంతకమణిని జాంబ

